# పల్లెటూళ్ళలో

వ్లాడిమిర్ క్రిపన్.

అనువాదకుడు:

గరిమెళ్ల సత్యనారాయణ.

విశ్వ సాహిత్య మాల,

ముంగండ, అంబాజీపేట పోస్టు.

రచన : 1930.

అయిదు అంకాలుగల నాటకం.

ఆంగ్లానువాదం: 1935:

బ్రెడ్

(సోనియా వాలోంకోవా.)

ఆంధ్రానువాదం 1938:

పల్లెటూళ్ళలో

(గిరిమెళ్ళ సత్యనారాయణ.)

అవంతీ ప్రెస్, ముంగండ.

వెల: 6- అణాలు.

# బ్రెడ్...

నేటిరష్యను నాటకరంగాన్ని తెలుసుకోవాలంటే రష్యన్ విప్లవచరిత్రతో కొంతవరకూ పరిచయం సంపాదించాలి. అలాగే రష్యనువిప్లవాన్ని గూర్చి తెలుసుకోవాలంటేకూడా, సోవియటు ప్రభుత్వంలో నాటకరంగానికి గల ప్రాముఖ్యతని గూర్చి తెలుసుకోవాలి. ఏమంటే, విప్లవానంతరం రష్యాలో వ్రాయబడిన నాటకాలన్నీ బ్రహ్మాండమైన సామాజికాభ్యున్నతికి ఏదోఒక వైపు నుంచి సహాయకరంగా వుండేటట్లే వ్రాయబడ్డాయి. పెద్ద వర్ణన లెందుకు?—సోవియటుప్రభుత్వానికి నాటకం కుడిచేయి.

"కళ కూడా ఒక ఆయుధమే!"

సోవియటు యూనియను చూడడానికి వెళ్లే యాత్రికులకు వినబడే కమ్యూనిస్టు హెచ్చరికలలో ముఖ్యమైనది ఇది. కమ్యూనిస్టులు నాటకకళని ఒక వజ్రాయుధంగా చూసుకుంటూన్నారు. ఉపయోగించుకుంటూన్నారు కూడాను. గ్రంథకర్త యొక్క భావనావేశాన్ని ప్రదర్శించడం కోసం కాదు అక్కడి నాటకం, అది సర్వశక్తిమంతంగా వుంటూన్న ప్రభుత్వం చేతిలో వున్న దివ్యాయుధం. కమ్యూనిస్టుసిద్ధాంతాల్ని ప్రచారం చేయడానికీ,

నిరక్షరతేముక్క — అంటు వొదలీ వొదలకుండా వున్న చూపుల
లకి సూక్ష్మంలో కర్తవ్యం మాపించడానికీ, అది ప్రధానంగా
ప్రయోగించుతూ వుంది.

ఇప్పుడు చూడండి ఈ నాటకాన్ని!

గ్రామసౌభాగ్యం పెంపొందాలంటే, ఉత్పత్తి అభివృద్ధిపొం
దాలంటే, సమిష్టివ్యవసాయికవిధానం అవసరం. కాని దానికి
మధ్యతరగతి రైతు విముఖుడు. భూస్వాములు ఈ యవకాశాన్ని
చూసుకొని సోవియట్లని కూలద్రోయడానికి పన్నాగాలు పన్ను
తూంటారు. ఈ స్థితిలో మధ్యతరగతి రైతుల్ని భూస్వాముల
పంజరుబడిలోనుంచి తప్పించి తమకి అనుకూలం చేసుకోవలసిన
విధానాన్ని ఎంతో నేర్పుగా బోధిస్తూంది, ఇది.

మైకేలోవు మూర్తీభవించిన పార్టీ కార్యవిధానం,- ఓల్గా
చెప్పినట్లు. రాయస్కీ - పార్టీ అంటే అభిమానం, ఆ కార్యంలో
అభినివేశమూ గల అనుభవశూన్యుడయిన పార్టీవర్కరు. క్వాసో
వన్నారా, నక్కలాంటి కుటిలఘాతకుడు. ఈ ముగ్గురి కార్య
క్రమాలలోనూ ఈ "గ్రెడ్" పరిణతి చెందిరది.

ఆ సంవత్సరాలు — అంటే 1929-30 లు సోవియటుచరిత్రలో
మరువరాని రోజులు. "కులక్"లను సంపూర్ణంగా నాశనం చేయ
డానికి, సోవియటుప్రభుత్వం ఆనాడు భూమ్యాకాశాలు తల
క్రిందులు చేసేస్తూంది. ఎంతో మంది పరిచారకుల్ని పల్లెటూళ్ళ
లోకి పంపింది.

ఆ వుద్యమంలో పాల్గొన్న వారిలో వ్లాడిమిర్ క్రిషన్ వొకడు. కమ్యూనిస్టుసల టీసుగా ఆతడూ పల్లెటూళ్ళలో వర్గ యుద్ధవ్యాప్తికి తంటాలుపడిన వాడే. ఆ సంగతులు చూసీ, అనుభవించీ, ఈ నాటకం వ్రాసేడు. పల్లెటూళ్ళలో పార్టీ అవలంబించవలసిన విధానాన్ని సూచించుతూ ఈ నాటకం ఆ విధానాన్నుంచి తొలగిన వారికి హితోపదేశం చేస్తూంది. ఆ నాటి పత్రికలకి వ్రాసిన రిపోర్టుమాదిరిగా వున్నా ఇది క్రిషన్ చేతిలో సజీవం అయింది.

1930 ఆఖరులు కాలంలో లెనిన్‌గ్రాడ్‌లోనూ, 1931 జనవరిలో మాస్కో ఆర్టుథియేటరులోనూ, ప్రదర్శించబడి విశేషంగా అభినందించబడింది. నేటికీ సోవియటు యూనియన్‌లో నలుమూలలా కూడా ఈ నాటకం తరచుగా ఆడబడుతూంది.

* * * *

క్రిషన్

1902 లో లెనిన్‌గ్రాడ్ నగరంలో పుట్టేడు. విప్లవంనాటికి అతగానికి 15 ఏళ్ళకంటె అధికం లేవు. విప్లవం రాగానే క్రిషన్ కమ్యూనిస్టు యువజనసంఘంలో చేరి అంతర్యుద్ధంలో కకేషియన్ ప్రాంతాలలో పోరాడేడు. 1920 లో కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగా చేరి ఆనాటినుంచీ పార్టీవ్యవహారాలలో శ్రద్ధతీసుకొని పనిచేస్తూన్నాడు. 1920 తరువాతనే స్వెర్డ్లోవు యూనివర్శిటీలో చేరి చదువుకున్నాడు. శ్రామికవర్గరచయితల సంఘా

న్ని మొదట రొస్టోవ్‌లోనూ, తరవాత ఉత్తరకాకేషియాలోనూ నిర్మించేడు. “రాప్” అనే రష్యను శ్రామికవర్గ రచయితల సంఘం లోపల కొంతకాలం ప్రధాన సభ్యుడుగా పని చేసేడు. నేడు “రాప్” రద్దుకావడం చేత, దానికి మారురూపమే అయిన సోవియెట్ రచయితల సంఘానికి ప్రధానిగా వుంటూన్నాడు.

ఈతని రచనలు.

ఏ. ఉస్పెన్‌స్కీతో కలిసి 1926 లో “కాన్‌స్టెంటయిన్ తెఖిన్” అంటూ తన మొదటినాటకాన్ని వ్రాసేడు. “రైల్స హమ్” అనేది 1928 లో, “సిటీ ఆఫ్ విండ్స్” అనేది 1929 లో, “బ్రెడ్” అనే ఈ నాటకాన్ని 1930 లోనూ, వ్రాసేడు. ఈ మధ్య రష్యను రచయితలంతా పోటీచేసిన నూతననాటకరచన పోటీలో క్రిషన్ యొక్క “మిరాక్యులస్ ఎల్లాయ్” అనేదే మొదటి బహుమతీ సంపాదించింది. ఇవిగాక—

ఎన్నో సినేరియోలూ, సంపుటాలు నిండే వాఙ్మయవిమర్శలూ, ఎన్నెన్నో వ్రాసేడు.

*　　*　　*　　*

ఇటువంటి ఉత్తమనాటకాన్ని మా గ్రంథమాల ద్వారా ఆంధ్రులకి అందియ్యగల అవకాశం కల్గించినందుకు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారికి కృతజ్ఞులం.

ముంగండ.

నవంబరు 1939.　　　　సంపాదకుడు.

# పాత్రలు.

మైకేలోవ్ డిమిట్రీ పెట్రోవిచ్:- జిల్లాకమ్యూనిస్టు పార్టీకి కార్యదర్శి. 35-40 ఏళ్ళ వయస్సు. గంభీరమయిన విగ్రహం. మాంచి ఆలోచన గలవాడు.

ఓల్గా:- అతని భార్య. అందమయిన విగ్రహం. కొంచెం వలంగా వుంటుంది. వయస్సు పాతిక ఏళ్ళు వుంటాయి. ఒక చిన్న పట్టణంలో కాపురం పెట్టినందుకు మొగడిమీద చిర్రు-బుర్రు మంటూ వుంటుంది.

రాయస్కీ పావేల్:- జిల్లాకమిటీకి కొత్తగా వచ్చిన ప్రతినిధి. వయస్సు ముప్పయి దాటుతుంది. నమ్మతగిన కమ్యూనిస్టే. కాని, కొంచెం విలాసపురుషుడు. పెద్దఎత్తులు వేస్తాడు.

జోకోవ్:- జిల్లాకమిటీ నియమించిన నిర్మాణశాఖకి సంచాలకుడు.

కోనోవోవ్:- కమ్యూనిస్టు పార్టీయొక్క స్థానికశాఖలో ఒక పరిచారకుడు.

షెరవోనికోవ్:- మండలవార్తాపత్రికా సంపాదకుడు.

లకియానికోవ్:- అసిస్టెంటు రోడ్డు సూపరింటెండెంటు.

కాశ్యాకోవ్:- ఆ జిల్లాలోని సాముదాయిక స్వాస్థ్యశాఖకి సంచాలకుడు.

గ్రోమోవ్ :- ప్రభుత్వాదాయవ్యయ శాఖకి మేనేజరు. కమ్యూనిస్టు.

లోక్టేవ్:- కమ్యూనిస్టు పార్టీయొక్క స్థానిక శాఖకి కార్యదర్శి. ఇంచుమించు ముప్పయి ఏళ్ళు వుంటాయి.

జోటోవా:- కమ్యూనిస్టుయువజన సంఘానికి కార్యదర్శిని. పదునెనిమిది ఏళ్ళకి అధికంగానే వుంటుంది, వయస్సు. చురుకైన రైతుపిల్ల. ఆమెలోగల పెద్దలోపం మితిమీరిన చురుకుదనమే.

డైకోవ్ సైంకేన్ పాలోవిచ్:- గ్రామసోవియటుకి అధ్యక్షుడు. ముసలిరైతు. గ్రామంలో మంచి పలుకుబడి గలవాడు.

రోమనోవ్ నికోలాయ్:- ఒకరైతు. ఒకప్పుడు కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా వుండేవాడు. వయస్సు 30 కీ 40 కీ మధ్యలో వుంటుంది. అంతర్యుద్ధపు రోజులలో గొరిల్లాయుద్ధాలలో ఒక చేయి పోగొట్టుకున్నాడు. మనిషిలో సురేకారపు పాలు ఎక్కువ. శత్రువులంటే దయాదాక్షిణ్యాలు చూపకూడదంటాడు.

సోటిన్:- భూమీ-పుట్రా లేని రైతు. కమ్యూనిస్టుకార్యక్రమంలో శ్రద్ధగా పాల్గొంటూన్నాడు.

క్వాసోవ్ ఇవాన్ జెరాసిమోవిచ్:- అదోకరకం మనిషి. పెద్ద రైతు. (కులక్) బాగా డబ్బున్నవాడు. దగ్గరదగ్గరగా అరవయి ఏళ్ళుంటాయి. సోవియటులంటే మహాకోపం. తెలివితేటలు గల ద్రోహి.

పాషా:- అతని కూతురు. వయస్సు 22 వుంటాయి. రూపసి. పుష్టి గల సుందరశరీరం.

మైకేల్:- అతని కొడుకు. 24 ఏళ్ళు వుంటాయి. పూర్వకాలపు మనిషి.

| | |
|---|---|
| కోటికిన్ వాసిలీ అఫనాశీవిచ్,<br>జుబోవ్ పావేల్ ఇవానోవిచ్,<br>షోప్కిన్ సోఫ్రిన్ కుజ్మిక్, | కులకులు. అంటే బాగా డబ్బు గల రైతులు. |
| ఓల్గా వాసిలీ పాలోవిచ్,<br>కోరిటోప్క ఇగ్నట్ వాసిలీవిచ్,<br>షిలోవ్ వాసిలీ, | ఒకపాటి ధనవంతులయిన మధ్యతరగతి రైతులు. |

గ్రిన్కిన్ నికనేక్ సెమినిచ్:- బీదరైతు.

మిషా:- అఫనాశీవ్:- కమ్యూనిస్టు యువజనసంఘంలో సభ్యురాలు.

మోక్రినా:- జోగిని. వింత ప్రకృతి గలది. సోవియట్లు అంటే పరమాసహ్యం గలది.

కాటరీనా:- రైతుకుటుంబానికి చెందిన స్త్రీ.

దాషా:- పైపనిచేసే స్త్రీ.

స్త్రీ పురుషులయిన రైతులు.

కమ్యూనిస్టుయువజనసంఘ సభ్యులయిన యువతీ-యువకులు.

*        *        *        *

సమయం- 1929 లో ఆకురాలు కాలం.

ప్రదేశం- సోవియటు రష్యాలో ధాన్యం పండించే ఒక జిల్లా.

*        *        *        *

# మొదటి అంకం.

ఒకటో రంగం.

మైకేలోవ్ ఇంట్లో చదువుకొనే గది. గదంతా చిందర వందరగా హడావిడిగా వుంది. గదిలోని బల్లలన్నీ పుస్తకాలతో నిండివున్నాయి. వెనుకటి గోడ పొడూగునా పుస్తకాలతో నిండిన షెల్ఫులు నిలబెట్టబడి వున్నాయి. ఒక వేపున చిన్న టేబిలూ, దానిమీద టెలిఫోనూ, కొన్ని కాగితాలూ, కనబడుతున్నాయి. గదికేసి చూడగానే అక్కడి పనికి తెమలిక వుండదనిపిస్తుంది. అందుచేతనే నీటుదనానికి తిలాంజలి ఇచ్చివేయబడింది. పుస్తకాల షెల్ఫులకి ఎదురుకుండా పెద్ద సోఫా ఒకటి వుంధి. గదికి వున్న రెండు ద్వారాలలోనూ ఒకటి వసారాలోకీ, మరొకటి మిగిలిన గదులలోనికీ, వుంది.

మైకేలోవ్ బల్లదగ్గర పనిలో మునిగివున్నాడు. నలభై యేళ్ళు దగ్గరపడుతున్నాయి, ఆతడికి. మనిషి సన్నగా, పొడుగుగా, వుంటాడు. మోటుగా కనిపిస్తాడు. బట్టలవిషయంలో ఆట్టే శ్రద్ధ లేదు. ప్రస్తుతం గడ్డం తెగమాసివుంది. చూపులు ఎంతో అలసటను సూచించుతున్నాయి. మనిషికేసి చూడగానే పని బరువయిపోయినట్లు అర్థం అవుతుంది. ఆతని కాలు కొంక దానికి కట్లువున్నాయి. రూపంలాగే మాటా ఏ మాత్రపు తళుకూ, బెళుకూ, లేకుండా కటువుగా వుంటుంది.

ఆతని భార్య ఓల్గా చాలా అందమైనది. తీరయిన శరీరం. వయస్సు ఇరవైనాలుగు ఏళ్ళుంటాయి. అలంకరించుకోడానికి బాగా శ్రమపడుతుంది ఎర్రని వున్ని దుస్తులు ధరించింది. ఆ కట్టుకోవడంలో ఎంతో నేర్పు చూపించింది. ఆమె పెట్టెల దగ్గరకూర్చుంటూ పుస్తకాలు వేనికవి పేరుస్తూ, కొన్నింటిని సోఫా మీద పడేస్తూంది.

మైకేలోవ్:- ఎందు కాలాగ పారేస్తావు, వాటిని? నెమ్మదిగా

పెట్టలేక?

ఓల్గా:- నాకు "సెవర్గ్" అంటేనే విసుగు పుడుతూంది.

మైకేలోవ్:- మళ్ళీ ఏదో ధోరణిలో పడినావే!

ఓల్గా:- ఈ వూళ్ళో వుండడం అంటే మహా అసహ్యంగా వుంది. అజ్ఞానం, కటిక చీకటి, ఇక్కడి కాపురం వున్నాయి. ఈ పట్టణానికంతకీ శోభచేసి మూడువందల పదకొండు వీధి దీపాలా?

మైకేలోవ్:- ఇక్కడ మూడువందల పదకొండే దీపాలున్నాయని నీ కెవరు చెప్పారు!

ఓల్గా:- నీ నివేదికలో చూశా.

మైకేలోవ్:- ఆ నివేదికనే కొంచెం కొనసాగిస్తూ చదువుతే ఈ ఏడాది ఆఖరుకి మరో ఐదువందల పంక్తొమ్మిది దీపాలు పెట్టబోతున్నామని తెలిసి వుండేదిగా!

ఓల్గా:- (దిగులుగా) నాకు ఒక పెద్దపట్టణంలో వుండాలనుంది.

మైకేలోవ్:- మరొక ఐదేళ్ళనాటికి ఇక్కడి జనసంఖ్య ఐదు లక్షలు అవుతుంది.

ఓల్గా:- అబ్బ! ఇప్పటికే ప్రాణం విసికిపోయింది, మైకేల్!

మైకేలోవ్:- ఎందుకో, ఏమిటో, నాకేమీ అర్థం కాదు.

ఓల్గా :- [తిరిగి నిట్టూర్పు] ఔను! ఏమీ అర్థం కాదు.

తలుపు చప్పుడు ఔతుంది. ఒక్క నిముషం
ఇద్దరూ తటపటాయిస్తారు.

మైకేలోవ్:- [పత్రిక, నన్న చేతిజత్తం అందుకొని లేస్తాడు]
బహుశా ఇంజనీర్లు అయివుంటారు. తలుపు తీస్తా.
ఓల్గా:- కదలకుండా కూర్చుంమా, ఒక్క నిముషం!

వరండా గుమ్మంలోంచి వెళుతుంది. తెరలోపల మాటలు వినిపించుతాయి. "రాయస్కీ" గదిలోకి వేగంగా వస్తాడు. ఐరోపాఖండపు కొత్త ఫేషనులో కుట్టిన కోటు తొడిగేడు. బొచ్చు టోపీ పెట్టేడు. చేతిలో అందమైన సూట్‌కేసు ఒకటి పట్టుకున్నాడు. గదిలోకి వస్తూనే దానిని నిర్లక్ష్యంగా ఒకమూలకి గిరాటు వేస్తాడు. గబగబా వచ్చి మైకేలోవ్ భుజం పట్టుకుని ముద్దుపెట్టుకుని కౌగలించుకుంటాడు. సంతోషం పట్టలేక అతని నడ్డిమీద తట్టుతాడు. రాయస్కీ మైకేలోవ్ కంటె చిన్న. నీటుగా ప్రపంచాను గుణంగా వుంటాడు. శుభ్రమయిన దుస్తులు. అందగాడు. ఓల్గా కూడా వరాండాలోంచి వస్తుంది. ఆమె పెదవుల మీద చిరునవ్వు కనపడీ కనపడకుండా వుంటుంది.

రాయస్కీ:- [సంతోషంతో] మిట్యా!

మైకేలోవ్:- [అంత సంతోషంతోటీ] నీ అసాధ్యం కూల! ఎప్పుడొచ్చినా హడావిడిగానే! ఏదీ చూడనీ, నీమొహం.

ఆనందంతో ఇద్దరూ ఒకరినొకరు తేరిపారి చూచుకుంటారు.

రాయస్కీ:- మిట్కా! నీ కాలుకి ఇదేమిటిరా?

మైకేలోవ్:- ఆ. ఏమీ లేదు. బండీలోంచి పడ్డాను లే. మన రష్యాలో రోడ్లు ఎలాగ వున్నాయో నీకు తెలియదా యేం? ......ఊ. అందుచేత పడిపోయేను. దానికేంగాని, ఎక్కడి నుంచి ఈ రాక!

రాయస్కీ:- మీ జిల్లాలో ఇక్కడే ఇంక పనిచేస్తాను. [కాగితాలు తీసి చూపిస్తాడు.] ఈ మూడేళ్ళ నుంచీ జర్మనీలోనే వుంటున్నా

మైకేలోవ్:- అదీ సంగతి! అయితే మాతో కలిసి పనిచేస్తావు అన్నమాట. బాగుంది. చక్కని విషయం. ...కాని, చూడు. ఎంత తెలివితక్కువ పనిచేసేనో. ఓల్గా! ఇతడు నా స్నేహితుడనోయి! [రాయస్కీ, ఓల్గాలు కరస్పర్శ చేస్తారు.] ఊఁ. ఈ రాయస్కీ పావేల్ మా సేనలలో కమిస్సారుగా వుండేవాడు.

ఓల్గా:- ఔను. నేనూ అదే అనుకున్నా.

రాయస్కీ:- [ఓల్గాతో] మీకేలాగ తెలుసును?

ఓల్గా:- మీరొక పిచ్చివారని డిమిట్రీ చెప్పేవాడు.

రాయస్కీ:- [టోపీ తీసి వేళ్ళాకోకంగా] మిక్కా! వందనాలు.

టెలిఫోను గంట మోగుతుంది. మైకేలోవ్
రిసీవరు అందుకుంటాడు.

ఓల్గా:- [రాయస్కీతో] జర్మనీనుంచి వచ్చి ఎంతకాలం అయింది?

మైకేలోవ్:- [టెలిఫోనులో] ఔను.

రాయస్కీ:- మూడు వారాలు అయింది. ... మిక్కా బాగా చిక్కిపోయేడు. నడ్డికూడా వంగిపోయింది. ఎంత బాగా నడిపేవా డనుకున్నారు? ...మా బృందంలో అతనితో సమంగా నాట్యం చేసేవాళ్ళే లేరు.

మైకేలోవ్:- (వెనకటి మాదిరిగానే) ఔను......

ఓల్గా:- ఇతడా! నాట్యం? మీరు జర్మనీ రాయబారవర్గంతో వెళ్ళేరా?

రాయస్కీ:- ఊహూ! శాస్త్రపరిశోధనాశాఖతో వున్నాను.

ఓల్గా:- అయితే మీరు ప్రొఫెసరు లన్నమాట! (చిరునవ్వు నవ్వుతుంది.)

మైకేలోవ్:- ఔను......

రాయస్కీ:- మీకు చాలా ఆశ్చర్యంగా వుంది కాబోలునే!

మైకేలోవ్:- నాకు సమ్మతమే. [రిసీవరు క్రింద పెట్టేస్తాడు.] ఏమిటి ఆశ్చర్యం అంటూన్నారు!

రాయస్కీ:- ఓల్గా!—ఇంక మిస్టర్ని పేరు పెట్టే పిలుస్తాను. ఏమీ తప్పుపట్టుకోవు కదా! [ఆమె తల వూపుతుంది.] నేను

ప్రొఫెసరు నంటే ఓర్లా నవ్వుతూంది. ఎందుకో ఏమిటో, నాకు చాలా ఆశ్చర్యంగా వుంది.

మైకేలోవ్:- కాని నాకు ఆశ్చర్యం లేదు. ఎప్పుడో ఒకనాడు ప్రొఫెసరువు అయి వస్తావని నేను అనుకొనేవాడిని. వీటికేం గాని, ముందు నీ గుడ్డలు తీయి. [రాయస్కీ కోటు తీస్తాడు. అతని గుండెల మీద ఎర్రజెండా పతకం కనిపిస్తుంది.] స్నానం చేయవూ!

రాయస్కీ:- అక్కర లేదు. స్టేషను దగ్గరనే ఆ తరవాయి తీరింది. ......మిట్కా! ఏమిటి ఈలాగ చిక్కిపోయేవు!

మైకేలోవ్:- అఘోరించినట్లేవుంది. దానికేం గాని, యూరపు విశేషా లేమిటి?

రాయస్కీ:- యూరపులోనా! ఇంకా యూరపేమిటీ! ఈ ఫెల్ గాలిగోపురం, ఆల్ప్సు శిఖరం మినహాగా ఈ రష్యాను అహంకారం ముందు ఏమయినా కనబడుతూందా?

మైకేలోవ్:- ఏం కోపం వచ్చిందా ఆ ముసిలిదానిని గురించి [పరిహాస] అలాగన్నా నని?

రాయస్కీ:- మనం ఎప్పుడూ ఎదగని విషయాల్ని గూర్చి అల్లా వెటకారంగానూ, తెలివితక్కువగానూ, మాటలాడితే నాకు మహావొళ్ళు మండింది, చెప్పొద్దూ.

మైకేలోవ్:- ఏం నీకు అంతలోకే ఎందు కంత కోపం?

రాయస్కీ:- ఈలా మాటలాడింది నువ్వొక్కడివే కాదు. అందు

చేతనే నాకెంత కోపం వచ్చింది. ఇంకా హరోషావాళ్ళ వద్ద మనం నేర్చుకోవలసిన సంగతులు కొద్దో గొప్పో వున్నాయి. మిట్కా! వాళ్ళకి "ఫాక్సుట్రాట్" నాట్యం తప్ప మరొకటి తెలియదని చెప్పే చవటల్ని కాల్చి చంపేద్దామా లనిపిస్తుంది.

మైకేలోవ్ :- నువ్వు జర్మనీ వెళ్ళేవా!

రాయస్కీ :- బెర్లిన్, హాంబర్గు, డ్రెస్డెనులలో వున్నాను. ...

...ఆ దేశం అంతా నూనె పోసిన యంత్రం మాదిరిగా నడిచి పోతూంది. విమానం లోంచి కోనిగ్స్-బర్గు చూస్తే గడియా రం మసలు విప్పి కళ్ళ యెదట పేర్చేరా అనిపిస్తుంది. [అతి శయించుతూన్న ఉద్రేకంతో] యంత్రాల హోరు, భూ గర్భంలోని రైళ్ళ గర్జనలు, వీటికి నేల అదిరిపోతూంటుంది. నిజంగా వినవలసినవీ, చూడవలసినవీ, అక్కడే వున్నాయి.

ఓల్గా:- రాత్రిళ్ళు దీపాలు వెలుతురుగా వుంటాయా?

రాయస్కీ :- ఎలక్ట్రిక్ దీపాలకి కళ్ళు జిగాల్మని పోతాయి. ఆ వెలుగులో అసలు మనం చదవగలమా! ఇంక ఇళ్ళు వుం టాయి. మిలమిలలాడిపోతూ! "టాంజన్ స్ట్రాసీ"లో ఒక భవ నం మీద షాంపెయిన్ గ్లాసు నిశ్శబ్దకాంతిలో వెలిగిపో తూన్నట్టు వుంటుంది. ఆకాశంలో షాంపెయిన్ సీసా ఆకారం కనబడుతుంది. దానిలోంచి షాంపెయిన్ పొంగుతున్నట్లే వుంటుంది.

టెలిఫోను మోగుతుంది. మైకేలోవ్ తీసేను

అందుకుంటాను.

మైకేలోవ్:- నేనే మాట్లాడుతూంట ... ఔను. అది అడిగేనులే... రూబిస్కీ జిల్లాకి కిరసనాయిలు ఎందుకు సప్లయి చేయలేదు! కార్యదర్శి నాకు ఫోను చేసేడు. నిన్న రాత్రి పార్టీ మీటింగులో కొవ్వువత్తులు వెలిగించుకుని కాలక్షేపం చేసేరుట. కొద్ది రోజులలోనే ప్రజలకి దీపాలకీ బదులుగా పాలకర్రలిచ్చేలాగున్నానే.............అబద్ధం! మూడు రోజుల క్రితమే కాదు, ఐదు టాంకులు తీసుకున్నారు! ... జాగ్రత! కొంప మునిగిపోతుంది! ...సరే! ......[రిసీవరు తగిలించి వేస్తాడు. రాయస్కీతో ] ...హాం పేయినా!

ఓ.గ్రా:- మోటారుల మూలంగా వీధులలో మనుష్యులు కనపడరంటారు, నిజమేనా?

రాయస్కీ:- విమానంలోంచి క్రిందికి చూసేమంటే, మోటార్లు ఒక దాని వెనకనొకటి క్రిక్కిరిసిపోయి వుంటాయి. ఇసక రాలుస్తే కూడా క్రిందపడదు. వీధులన్నీ అవే. ఆగడం—దారి ఇయ్యడం, అంటూ వుంటుందా! ఎప్పుడయినా ఆగుతే రోడ్ల మలుపులలో ఆగుతాయేమో. అదయినా ఆటోమాటిక్ సిగ్నలు ఇయ్యబడితేనే! కాలినడకని పోయేవాళ్ళు అలాంటి సమయాలలోనే రోడ్లు దాటుతారు.

మైకేలోవ్:- చాలా బాగుంది.

రాయస్కీ:- ఏమిటూ బాగున్నది!

మైకేలోవ్:- చాలా అందమయిన కథ చెప్పేవు. దానికేమిగాని, అక్కడి విప్లవోద్యమాలు ఏలా వున్నాయి? (ఇంతలో టెలిఫోను గంట మోగుతుంది.) క్షమించు. [రిసీవరు అందుకుంటాడు.] ఔను...ఔనౌను...అది చదివేను...చాలా బాగా వుంది. అక్షరాలు చాలా బాగా వున్నాయి. ఆఖరున ఎరువుల్ని గురించి కొంచెం చేర్చు ...పరాసరి పోగుచేయించి పొలాలకి చేర్చాలని చెప్పు.... దానిని పోగులుగా పోయించిన తరువాత భూములలో చల్లాలని చెప్పు. ఎన్ని ప్రతులు వేసేరేమిటి? ఏభైవేలా? చాలు. వాటినప్పుడే అందరికీ పంపేసేరా? ఎప్పటికి సిద్ధం అవుతాయి, మరి?......సరే! (రిసీవరు క్రింద పెడతాడు.) ఊఁ. ఏమిటోయి నీ అభిప్రాయం చెప్పు? పడమటిని విప్లవం వచ్చేటందుకు తగిన సావకాశాలు ఏమన్నా వున్నాయా?

రాయస్కీ:- అదక్కపోవడమేమని ఉబుసుపోకకి అడుగుతున్నావా-లేక నిజంగా తెలుసుకోవాలనేనా?

మైకేలోవ్:- నేను......

తలుపు దగ్గర చప్పుడు.

ఓల్గా! ... అరుగో ఇంజనీర్లు వచ్చేరు. ... నువ్వు ఇక్కడనే వుండరా పావెల్! ఎంతో సేపు పట్టములే. ఓల్గా! మేము మాటలాడుకుంటూంటే నువ్వూ విను. నీ పేపరుకి ఉపయోగించే విషయాలు చాలా వింటావు.

ఓల్గా తలుపు తీయడానికి వెడుతుంది. మైకేలోవ్ బల్లమీద నున్న కాగితాలలో రిపోర్టుకోసం వెదుకుతున్నాడు. రాయస్కీ సోఫామీద చిందరవందరగా పడివున్న పుస్తకాలు తిరగవేస్తూంటాడు. అసిస్టెంటు రోడ్డుసూపరింటెండెంటూ, ఇంజనీరూ, ఐన లరియానోవునీ, కమ్యూన్ ఖోజ్ [సాముదాయిక స్వామ్యశాఖ] సంచాలకుడు కాశ్యాకోవునీ, వెంట పెట్టుకుని ఓల్గా తిరిగి వస్తుంది.

కాశ్యాకోవు:- అమ్మయ్య! వచ్చేసేం. ఏమిటి నీ కాలుకేం?

మైకేలోవ్:- ఆఁ. మరేమీ లేదు. ఎముక కొంచెం గూడు తప్పింది. కామ్రేడ్స్! ఆలస్యం చేసేరు. పదిహేను నిమషాలు!

కాశ్యాకోవ్:- నా తప్పుకాదు. ఒట్టు... ఈ కామ్రేడ్ ...

లరియానోవ్:- నా పేరు లరియానోవ్. రోడ్డు సూపరింటెండెంటు వద్ద అసిస్టెంటుగా పనిచేస్తూన్నా.

మైకేలోవు:-ఓఁ. మీరా? దయచేయండి. [కుర్చీ చూపుతాడు. లరియానోవు కూర్చుంటాడు.] ఊఁ. పరిశ్రమంకి వద్దాం. అయితే మీరు చందా ఇవ్వడానికి ఒప్పుకోనట్లే కాదూ?

లరియానోవు:- మేము చందా ఇవ్వలేము.

మైకేలోవ్:- కాని, నీరు మాత్రం వాడుకుంటారేం?

లరియానోవ్:- నీరు ఒకరిదా యేం?
మైకేలోవు:- ఏదీ ఏ ఒక్కరిదీ కాదు. కాలువ తవ్వుతూన్నది మాత్రం ఎవరు? మన మే నా,-మరెవ్వరే నేనా?
కాశ్యాకోవు:- మనమే!
మైకేలోవు:- అందుకే కామ్రేడ్స్! మాకు కొంత డబ్బు కావాలి మీకు నీరు కావాలి. కనక చందా ఇవ్వండి!
లరియానోవు:- మేము డబ్బు ఇవ్వలేము. కాలువ మీదిగాని మాది కాదు.
మైకేలోవు:- ఐతే ఇవ్వరన్న మాటేనా?
లరియానోవు:- ఇవ్వలేము!
మైకేలోవ్:- సరే. పైసా పైసా చొప్పున మేమే వసూలు చేసుకుంటాము.
లరియానోవు:- పైసా పైసా చొప్పున అనడంలో మీ వుద్దేశం?
మైకేలోవ్:- మీరు వాడుకొనే నీటికి ప్రతి నూరుకడవలకీ ఒక పైసా చొప్పున వసూలు చేస్తాము. ఇవిగో లెఖ్ఖలు.[కాగితాలు తీస్తాడు.] రెండేళ్ళలో మొదటి వాయిదా పూర్తవుతుంది. ఐదేళ్ళనాటికి అంతా వసూలవుతుంది. పదేళ్ళలో...
లరియానోవ్:- ఒక్క మాట! ...మీ వుద్దేశం ఏమిటి? మీకీ అధికారం ఎవరిచ్చేరు?
మైకేలోవ్:- కాలవ మాదేనని మీ రిప్పుడే కాదూ అన్నారు!
లరియానోవ్:- దీనికి మరో శాఖ తవ్వనంటే?

మైకేలోవ్:- అహా! తప్పను. ప్రతినూరు కుండలకి కానీ తప్పదు.

లరియానోవ్:- రేపటి లోపున సమాధానం ఇస్తాను. ఆగుతారా? వెంటనే ఈ విషయాలు బోర్డు ఆఫ్ డైరక్టర్సుకి తంతి నిచ్చి తెలుసుకుంటాను.

మైకేలోవ్:- అలాగే. కాని, వెంటనే డబ్బు ఇవ్వాలని చెప్పండి. మాకు చాలా అవసరం!

లరియానోవ్ లేచి సెలవు తీసికొని వెడతాడు.

కాశ్యాకోవ్:- వాళ్ళు ఇస్తారంటావా?

మైకేలోవ్:- మహారాజులా. కాని, పన్ను వలన మనకీ అంతగా వుపయోగం లేదు. సరేగాని, ఆ కలిపిన మన్ను పరీక్షించేవా?

కాశ్యాకోవ్:- ఇంకా పదునాలుగు వందల సాజేనుల * మేర పరీక్షించాలి.

మైకేలోవ్:- ఇటికల మాట ఏమిటి?

కాశ్యాకోవ్:- ఇంకా తేల లేదు.

మైకేలోవ్:- నీ అంచనాలు నిన్నటికే చేరివుండాలి. ఒక క్షణం. [నోటు బుక్కు లోంచి చదువుతాడు.] 'కాశ్యాకోవు 12. న. ఇటికల ఫ్యాక్టరీ తాలూకు అంచనాలు.'

కాశ్యాకోవ్:- నీ తోడు! ఎక్కడా తీరుబడి లేందేనా. దేవుడి తోడు. నాకు ఒక్క నిమిషం తీరిక లేదు.

మైకేలోవ్: ఐతే వాళ్ళింకా అంకెలు వేస్తూన్నారా?

* సాజేను = 7 అడుగులు.

కాశ్యాకోవ్:- రేపటికి తప్పకుండా తెస్తా. నమ్మి. ఈ మాటుకి నన్ను క్షమించు.

మైకేలోవ్:- రేపు పదకొండు గంటలకి తేవలసిందే....

కాశ్యాకోవ్ కరస్పర్శచేసి సెలవు తీసుకుంటాడు. అబ్బే! అనుకున్న వేళకి పని పూర్తి చేయాలనే తెలియకపోతే? [తన జేబు నోటుబుక్కులో వ్రాసుకుంటాడు.] తూరీగల్ని గుండుసూదికి గుచ్చినట్లు వీళ్ళని ఆ కానితో లంకె వేయాలి. పడమటి సీమని గురించి ఏమిటి చెబుతున్నావు, రాయస్కీ!

రాయస్కీ:- [ఉద్రేకంతో] పాశ్చాత్యదేశాలలోని తీరే వేరు. కార్మికులు వీధికి వచ్చేరంటే రక్తం చిందిస్తారు.

మైకేలోవ్:- పెద్ద ప్రదర్శనాలూ. ఊరేగింపుల్నీ, గురించా?

రాయస్కీ:- చిన్నా లేదు. పెద్దా లేదు. ఊరేగింపు లన్నింటినీ చెదరగొడతారు. కొంతమంది నిరుద్యోగులతో కలిసి "రీచ్-స్టాగు" దరికి వెళ్ళేను. రబ్బరు తొడిగిన కర్రలతో పోలీసులు మమ్మల్ని బాదేరు. రివాల్వరు మడమలతో కొట్టేరు. నా చేయి విరిగింది కూడాను. "స్టారం-ట్రూపు్స"ని తప్పించుకోవడం బ్రహ్మాండం అయిందంటే నమ్మి.

మైకేలోవ్:- ఎందుకొచ్చిన అభినయం ఇది! అక్కడికి నువ్వు వెళ్ళడం పొరపాటు.

రాయస్కీ:- పక్కకి తప్పకొని కూలీలని ఏలా బాదుతూన్నారో చూస్తూ, నిల్చోమనా నీ సలహా!

మైకేలోవ్:- ఆ స్టారంపోలీసులు నిన్ను పట్టుకొనివుంటే ఈ పాటికి జర్మనులు ఎన్నైనా కథలు అల్లివుండేవారు. రష్యను గూఢచారులు కూలీల్ని రెచ్చగొడుతున్నా రని గోల చేసి వుండేవారు. నేను చెప్పింది నమ్ము. నువ్వు పత్రిక్కకి తప్పుకుంటే వచ్చే హానికంటె, అది చాలా ప్రమాదకరం.

రాయస్కీ:- నీది మంచి ఆలోచనగల బుర్ర. కాని, దానికీ సమయాసమయాలున్నాయి. అంటే ఏమిటో తెలుసా? అతి ఆలోచన కూడా ఒక్కొక్కప్పుడు విషమిస్తుంది.

ఓల్గా:- అదే డిమిట్రీ అయితే అసలు రీచ్-స్టాగుకే వెళ్ళకపోను.

మైకేలోవ్:- నిజం! ఆలోచన లేని పని ప్రమాదకరం అని నా వూహ.

రాయస్కీ:- నేను చేసింది తప్పే నన్న మాట. కాని, మళ్ళీ అటువంటి పరిస్థితులే సందర్భపడితే జర్మనుకూలీలతో కలిసి ఆ పోలీసులచేత మళ్ళీ దెబ్బలు తినడానికి సిద్ధం. నేను దెబ్బలు తింటూంటే, నువ్వొకమూల నిల్చుని చూడొచ్చు.

మైకేలోవ్:- నిజమయిన వీరుడిలా మాటాడేవు. కాని, నా దృష్టికి సార్థకం లేని పౌరుషం పిరికిదనంతో సమానమే!

రాయస్కీ:- ఐదేళ్ళ క్రితం అయితే నీనోట ఈ మాటలు వచ్చియుండవు. ...ఆఁ! కాని,... (గభీమని లేచి గదిలో అటు ఇటు పచారు చేస్తాడు. మరల సోఫామీద చతికిలబడి కాగితాలు తిరగవేస్తాడు.)

మైకేలోవ్:- నీకు ఆకలి వేస్తూందనుకుంటా. పావేల్! కడుపు లో ఎత్తడి పోయింది కనకనే అలా కర్రు-బుర్రు మంటూ న్నావు. ఓల్గా!......

ఓల్గా:- [వెక్కిరింతగా, రాయస్కీతో] ఇతరుల మానసిక భావా లని కనిపెట్టడంలో మైకేలోవ్ మహాసమర్థుడు...

మైకేలోవ్:- ఓల్గా! అతని కేదయినా పెట్టరాదూ?

రాయస్కీ:- నా కేమీ అక్కరలేదు.

మైకేలోవ్:- నీ తొందరపాటు ఇంకా తగ్గలేదు. (ఏదో జ్ఞాప కం వచ్చి బల్లమీది కాగితాలు తిరగవేస్తాడు.)

రాయస్కీ:- నువ్వు మాత్రం! నీ తొందరపాటు అప్పుడే తగ్గిపో యిందా! నిజంగా ఆరిందా వయ్యేవేం?

ఓల్గా:- ఏమిటన్నావు? ఆరిందా యనా!

మైకేలోవ్:- ఊహుఁ. ...[కాగితాలు తిరగవేస్తూ] అయితే, ఆకలి లేదంటావా! పోనీ కొంచెం వోడ్కా పుచ్చుకో. మా యింటిలోనిదే లే.

రాయస్కీ:- వద్దు.

టెలిఫోను గంట మోగుతుంది. మైకేలోవ్ రిసీవరు అందుకుంటాడు.

మైకేలోవ్:- ఔను...ఔను ... నేనే. సరే! నీ కోసం ఎదురు చూస్తూంటా. [బల్లదగ్గర కూర్చుంటాడు.] జిల్లాకమిటీనుంచి పిలుపు వచ్చింది.

ఓ.గ్గా:- (రాయస్కీతో నెమ్మదిగా) ఏమిటి మీ రంత నీరసం గా కనబడతారు?

రాయస్కీ:- గత కొద్ది సంవత్సరాలలోనూ రష్యాలో ఎంతటి మార్పు వచ్చింది! నా మిత్రుల మొగాలు అస్తమించుతూన్న సూర్యబింబాల మాదిరిగా కనబడుతున్నాయి. ఒకప్పుడు జాజ్వల్యమానంగా వున్న మన వాళ్ళంతా చప్పబడిపోతూ న్నారు....ఈ మిట్కాని చూస్తే నాకు ఏడుపొస్తూంది... వాడు క్రింద నిలబడే వాడా? ఎప్పుడూ గుర్రం మీద వున్న ట్టే! ...బెర్లిన్ మీద విరుచుకుపడా లనేవాడు....అలాం టిది ఇప్పుడు ఏలాగ తయారయ్యేడు!

మైకేలోవ్:- (టెలిఫోనులో) ఔనౌను. మైకేలోవే మాటలాడు తూంట. కామ్రేడ్ ఆంటనోవ్! గడచిన ఐదురోజులలోనూ ఉన్నదంతా పంపేసేం. ... ఔను. అరవైమంది వెళ్ళేరు. ... మా కోసమని ఒక లక్ష వుంచుకున్నాం. ...ఊహూం తెలిసింది. రేపటినుంచి బళ్ళకి ఎక్కించడం ఆరంభిస్తాములే. ...సరే! ఉన్నంతవరకు పోగుచేస్తాం...అలాగే. ఊఁ. ... సెలవు. [రిసీవరు క్రింద పెడతాడు.] రష్యాకు తిండి కావాలి!

[తెర పడుతుంది.]

రెండో రంగం.

అదే గది. మైకేలోవ్ బల్లదగ్గర కూర్చుని పేర్ల జాబితా పరీక్షించుతున్నాడు. జిల్లాకమిటీవారి నిర్మాణశాఖాసంచాలకుడు జుకోవు ప్రక్కన వున్నాడు. నీటుగానూ, సుందరంగానూ, వున్న దాషా అనే టైపిస్టుగరల్ దగ్గరనే తన పనిలో మునిగివుంది. స్థానికపత్రికా సంపాదకుడు పెరివోనికోవ్ గదిలో మరో మూలనున్న బల్లవద్ద కూర్చుండి ఒకవ్యాసం వ్రాయడానికి సాధకం చేస్తూన్నాడు. ఆతడికి వయస్సు మరలింది. మీసాలు నెరిసేయి. పురుగుకొట్టిన బట్టలు కట్టుకున్నాడు.

మైకేలోవ్:- [ఒక పేరు కొట్టివేస్తూ] చిత్యాకోవ్ మొహం ఈడ్చేరి. కాని, ఈ మిగతావాళ్ళంతా మహాదిట్టమైనవాళ్ళు. కొనోనోవ్ పేరుదగ్గర ఈ గుర్తు ఏమిటి?

జుకోవ్:- ససేమిరా వెళ్ళనంటూన్నాడు. పెద్ద అల్లరి పెడుతూన్నాడు. సెంట్రల్ కమిటీకి వ్రాస్తాడుట.

మైకేలోవు:- ఆతని కోసం కబురంపేవా?

జుకోవు:- వస్తూన్నాడు.

మైకేలోవు:- ఎవరీ లోబిస్కోవు! "ఓక్రూజా" యేనా!

జుకోవు:- ఔను.

మైకేలోవు:- అబ్బే! నత్తివాడు.

జుకోవు:- ఏమేనా, పెద్ద ఉపన్యాసా లీయబోతారా యేం?

మైకేలోవు:- వద్దు. అతని పేరు తీసేద్దాం. ఒక్క మాట నోటి నుంచి ఊడి బయటపడేటప్పటికి, ఆ రైతులు పాతికప్రశ్నలు వేస్తారు. ...గ్రోమోవు కూడా వెళ్ళనంటున్నాడా?

జుకోవు:- వాళ్ళందరికీ కబురంపేను.

టెలిఫోను మోగుతుంది.

మైకేలోవు:- ఆఁ. నేనే. షేర్మనా? ...నీవిక్కడికే రా....... రేపాక్క మాటు ఈ జిల్లాలన్ని మనం చుట్టిరావాలనుకుంటాను. ...ఔను....ఔనౌను. అలాగే.... [రిసీవరు క్రింద పెడతాడు. సంపాదకుడితో] నీ వ్యాసం ఎంతవర కయింది?

పెరియానికోవు:- ఇదిగో చూడు. దీనికి తలా-తోకా దొరకడం లేదు, మరి.

మైకేలోవు:- ఏమిటి లోపం!

పెరియానికోవు:- ఇదిగో చూడు. పెద్ద పెద్ద సమాసాలూ, పణుగు రాళ్ళలాంటి మాటలూ.

మైకేలోవు:- ఆ సమాసాలు లాగెయ్యి.

పెరియానిక్కోవు:- అలా చేస్తే వ్యాసం చప్పగా వుంటుంది.

మైకేలోవు:- సరే. నీ యిష్టం వచ్చినట్లు కానీయి. దాషా! ప్రూఫులు వచ్చేయా!

దాషా:- ఊహుఁ. రాలేదు.

మైకేలోవు:- మామూలు భాగోతమే!

తలుపు దగ్గర చప్పుడు.

జుక్కోవు:- [తలుపు దగ్గరకి వెళ్ళి] తలుపు తీసేవుంది.

మైకేలోవు:- [టెలిఫోనులో] నాకు ఒకటీ పదహారు ఇయ్యి... ఔనౌను. వన్ సి..క్స్..టీన్..ల్.... అందులోనూ పోపోవ్ వున్నది. పోపోవు! హలో...ఈలా విను. ప్రూఫులు ఏవి! ఒంటిగంటకి ఇంక పదినిముషాలుంది. నిన్ను అరస్టుచేయిస్తా. జాగ్రత. నిన్న చెప్పలేదు? నువ్వు పంపే మనిషితో నాకేం పనిలేదు. వాడొక త్రాగుబోతు కావచ్చు...ప్రూఫులు సరిగ్గా 12 గంటలకి రావలసింది. అప్పుడే పదినిముషాలు తక్కువ ఒంటిగంట అయింది. కాని, ప్రూఫులు రాలేదు. ఆ దిక్కుమాలిన తిండి తరవాత తిందువు గాని, లే. దాచు...మా ఆఫీసులోని తిండి మరేం అంత బాగుండదు....

కొనోనోవు గదిలోకి వచ్చి ఆ బెదిరింపు లన్నీ వింటాడు. మైకేలోవు రిసీవరు క్రింద పెడతాడు.

మైకేలోవు:- ఏమోయి, కొనోనోవు! వచ్చేవూ? సరే గాని పల్లెటూళ్ళకి పోనన్నావని విన్నాను. అదేమిటి!

కొనోనోవు:- ఎవరు? నేను! అలాగన్నానని ఎవరు చెప్పేరూ? అజ్బే! తప్పకుండా వెడతా.

జుకోవు:- [ఆశ్చర్యంతో] తప్పకుండా వెళతావూ? అయితే ఆ గంద్రగోళం అంతా ఏమిటి?

కొనోనోవు:- ఊరికే తమాషాకి అన్నాను. అయితే మైకేలోవు తో ఆ మాట చెప్పేవా?

మైకేలోవు:- అయితే ఇక్కడి కెందు కొచ్చినట్లు నువ్వు?

కొనోనోవు:- నేనా. నేనా. మీ అందరి వద్ద సెలవు తీసుకుం..

మైకేలోవు:- సరే, మరి. సుఖంగా పోయిరా. జిల్లాకమిటీఆఫీసు లో నీ ప్రయాణపు చీటీ వుంది, తీసుకో.

కొనోనోవు:- సెలవు! మైకేలోవు! సెలవు!

వెడతాడు.

మైకేలోవు:- [పెరియానికోవుతో] వ్యాసం ఏమవుతూంది?

పెరియానికోవు.- ఇదిగో చూడు! కరుణ చిలుకుతూంది.

మైకేలోవు:- నీ కరుణరసం కాలిరి.

పెరియానికోవు:- ఇదిగో చూడు. అది లేకుంటే కోర్టుతీర్పులా తయారవుతుంది.

మైకేలోవు:- కానీ, శ్రమపడి, ప్రయత్నించి, వ్రాయి.

గ్రోమోవు ప్రవేశించుతాడు.

గోమోవు:- నేను పూళ్ళకి పోను.

మైకేలోవు:- ఏం! ఎందుచేత?

గ్రోమోవ్:- మాస్కో నుంచి పరీక్షకసమితి కొద్దిరోజులలోనే రాబోతూంది, కాదూ?

మైకేలోవ్:- ఔను.

గ్రోమోవ్:- నా నిర్మాణకార్యాలన్నీ సకాలంలో ముగియాలా, అక్కర లేదా?

మైకేలోవ్:- తప్పకుండా.

గ్రోమోవ్:- ముందటేటికి మడిసరుకులు నిలువచేయాలా, వద్దా?

మైకేలోవ్:- విధిగా.

గ్రోమోవ్:- మాకు నియమించిన పనిలో నూటికి పదమూడువంతులు వెనకబడియున్నాం. అది పూడ్చుకోవాలా వద్దా?

మైకేలోవ్:- తప్పదు.

గ్రోమోవ్:- ఈ పనులన్నీ చేయించడానికి నేనిక్కడ ఉండాలి. ఏం? అక్కరలేదా?

మైకేలోవ్:- అక్కర్లేదు. నువ్వు ఉండవలసిన పనిలేదు. గ్రోమోవ్! నువ్వు పల్లెటూళ్ళకి పోయితీరాలి. జిల్లాకమిటీ ఆఫీసుకి పోయి నీ ప్యాసు తీసుకో.

గ్రోమోవ్:- ఐతే ఇక్కడి పనికి పూచీ ఎవరిది?

మైకేలోవ్:- నీదే. నువ్వే పూచీ. సరియైన సహాయం తీసుకోని వుండకపోతే దాని ఫలితం నువ్వే అనుభవిస్తావు. నీకిచ్చిన పని పూర్తిచేయకపోతే నువ్వే బాధ పడతావు. సకాలంలో నీ నిర్మాణకార్యక్రమం పూర్తిగాకుంటే నువ్వే అనుభవిస్తావు.

గ్రొమోవ్:- వీటికి తోడు నేను వూళ్ళకికూడా పోయేదా!

మైకేలోవ్:- ఆఁ. వెళ్ళాలి. తప్పదు. ఇదేమీ సుఖపడేటందుకు సమయం కాదు, గ్రొమోవ్!... ఊఁ. ఇంకేమయినా ప్రశ్నలున్నాయా!

గ్రొమోవు:- కావలసి నన్ని. అవన్నీ పార్టీసమావేశంలోనే.

మైకేలోవ్:- నువ్వు సమావేశానికి ప్రతినిధిగా ఎన్నుకోబడి వుంటేను. ఎన్నుకోబడి వుంటేను! ఈ మధ్యని పార్టీసమావేశంలో నువ్వు తరుచుగా కనపడడం లేదు. కానా?

గ్రొమోవ్:- అయితే నీకు గూఢచారు లున్నా రన్న మాట!

మైకేలోవ్:- పార్టీలో మాటలు మోసే రకం ఎవ్వరూ లేరు. ఎందుకు ఊరికే కంఠశోష పడతావు!

గ్రొమోవ్:- [పెంకితనంగా] కమ్యూనిస్టుపార్టీలో......

భళ్ళున తలుపు తెరుచుకుంటుంది. గ్రోమోవ్‌ని ప్రక్కకు తోసి ముద్రాపకుడు పంపిన ముసిలివాడు హడావిడిగా లోపలికి వస్తాడు. గ్రోమోవు మండిపడుతూ పోతాడు.

మైకేలోవ్:- [లేచి నిలబడి అరుస్తాడు] ఏమిటో పార్టీ అంటున్నావు? పార్టీ-ఏమిటి?

ముసలివాడు:- [గుండెలు అణచుకుంటూ, ఆయాసపడుతూ,] ప్రూఫులు ... పన్నెండుగంటలకి-.

మైకేలోవ్:- ఈలా నా చేతికియ్యి. (తీసుకొని పరీక్షించుతూన్నాడు.) తగల పెడుతూన్నాడు. స్కౌండ్రల్...

ముసలివాడు:- (గట్టిగా) అబద్ధం!

మైకేలోవ్:- ఏమిటి నువ్వంటావు! అబద్ధం ఏమిటి?

ముసలివాడు:- ఏమీ పాడు చేయడం లేదు. ఇంక ఆయాసాన్ని గురించా! పరుగెడితే ఆయాసం రాదు!

మైకేలోవ్: నిన్నేమీ అనలేదయ్యా! [గ్రూపులు చూసి,] ఇదిగో ఎప్పుడూ పగులుతుంది. ఇక ముందునుంచి పదినిమిషాలు ముందుగానే ఇయ్యమను. లేకుంటే వేళకి అందుకోలేవు.

ముసలివాడు:- [స్థిమితపడి] అలాగే.

మైకేలోవ్:- [ముసలివానితో] నువ్వు వెళ్ళొచ్చు. [జుకోవుతో] నువ్వు కూడా వెళ్ళు. రేపుప్రొద్దుటే అందరూ బయలుదేర వలసిందే. కార్యదర్శు లందరికీ ఫోనులో చెప్పు.

జుకోవ్:- ఫ్యాక్టరీనుంచి నిన్ను ఎవ్వరూ ఫోనులో పిలవలేదు!

మైకేలోవ్:- లేదు. ఎందుకు?

జుకోవ్:- వాళ్ళేదో నీతో మాట్లాడాలన్నారు.

ముసిలివానితో వెడలాడు.

మైకేలోవ్ తన పనిలో మునిగిపోతాడు. వెరియూనికోవ్ కృత్యాద్యవస్థకి లోనవుతున్నాడు. తనలో తానే చదువుకుంటాడు. అభినయిస్తాడు. కొన్ని పం

క్తులు కొట్టేస్తాడు. మళ్ళీ వ్రాస్తాడు. ఆలోచిస్తాడు. ఆతని చుట్టూనలిపి పారేసిన కాగితాలు పడున్నాయి. వరాండాలో ఓల్గా నవ్వు వినబడుతుంది. ఆమె రాయస్కీతోసహా ప్రవేశిస్తుంది. ఇద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఓల్గా:- నిజంగా రాయస్కీ వట్టి పిచ్చివాడు. వీధిలో పిల్లలతో పేక ఆడేశాడు. ఒక ముసిలిదానిని బురదలోకి ఈడ్చేడు. తీరా ఇంటిదాకా వచ్చి ఒక మోటారు క్రింద పడిపోయినవాడే, దాటిపోయేడు గాని.

పెరియానిక్నోవ్:- అదేమిటి!

ఓల్గా:- క్షామేశ్! వీరిక్కడనే వున్నారూ! నమస్కారం. నేము వీధి వెంబడే నడచివస్తూంటే ఒక కారు మా వెనకాల వచ్చింది. ఇతగాడు కారుముందరనుంచి ఒక్కపరుగుతీసేడు. నా ప్రాణం హడిలిపోయి వెర్రికేక పెట్టాను.

మైకేలోవ్:- ఏమిటీ వెర్రిపని!

రాయస్కీ:- నువ్వాట్టే కంగారుపడకోయి! ఈ కాళ్ళలో శక్తి లోపం లేదు.

మైకేలోవ్:- నాకు తెలుసు. నువ్వు చేసినది వెర్రిపని. కారుని మీ మీదనుంచి పోనీయడం డ్రైవరు కేమన్నా సరదాయా? కాని, అలాగంటి సమయాలలో ఏమీ తోచదు. ఆపలేకపో

వచ్చు. నీ కిదంతా తమాషాగానే వుంటుంది.

ఓల్గా:- ఒరి బాబూ! ఆఖరికి ఎంత మందకొడిదనం వచ్చింది?

రాయస్కీ:- బహుశా నువ్వు చెప్పినది నిజమే కావచ్చు. కాని, డిమిట్రీ! మనం వేసే ప్రతిఅడుగూ ఆలోచించి వేయడం సాధ్యపడదు.

మైకేలోవు:- ఎప్పుడూ ఆలోచించడానికి అగకపోవడని నావూహ. అడుగు వేసే టప్పుడల్లా ఆలోచించకపోవడం దుస్సాధ్యం. [ఒక్క నిముషం ఊరుకొని] రైతులనుంచి ధాన్యపు వసూళ్ళకి నువ్వు పల్లెటూళ్ళకి పోవాలి. అదీ నీ మొదటిపని.

ఓల్గా:- ఎప్పుడు?

మైకేలోవు:- రేపు.

రాయస్కీ:- రేపేనా? అయితే డిమిట్రీ! వెళ్ళమని నువ్వు సలహాయిస్తూన్నావా, లేక జిల్లాకమిటీ కార్యదర్శివిగా ఆజ్ఞాపిస్తూన్నావా?

మైకేలోవు:- రెండింటిలో తేడా ఏమిటి?

రాయస్కీ:- పార్టీ ఆజ్ఞ అయితే నేను రేపే బయలుదేరాలి.

మైకేలోవు:- జిల్లాకమిటీ నిర్ణయం అది. (సంపాదకుడితో) నీ వ్యాసం ఎంతవరకు వచ్చింది?

పెరియానికోవు:- ఇదుగో చూడు...

మైకేలోవు:- [గట్టిగా] నీ చూడడం మండిరి! ఆ పని నేనే చేసుకుంటానులే. (శాంతంగా) దాషా! టైప్ రైటును తీసుకో. లే.

నే చెప్పుతూంటాను. నువ్వు టైపుచేయి.

దాషా టైపుమిషను తీసుకొని బయలుదేరింది. తన చేతికర్ర మీాద ఆనుకొని మైకేలోవ్ ఆమె వెను కనే వెడతాడు. భయంతో పెరియానికోవ్ కూడా వెంబడిస్తాడు.

ఓల్గా:- [ఆందోళనతో] అయితే నువ్వు రేపు వెడతావా!

రాయస్కీ:- ఇంతవరకు నేను పార్టీ అజ్ఞల్ని తిరస్కరించలేదు.

ఓల్గా:- కాని, ఇది పట్టి అవివేకం! నాయకత్వం వహించగల నీ సమర్థతని పార్టీ ఉపయోగించుకొని వుండవలసింది.

రాయస్కీ:- పార్టీ తన అవసరాన్ని పట్టి ప్రతిమనిషినీ ఉపయో గించుకుంటుంది.

ఓల్గా:- ప్రతిమనిషిని గూర్చి ఆలోచించి ఆతనిని తగురీతిని వుప యోగించుకోవచ్చు. వారిని పార్టీ వెనక దాచపనిలేదు. పార్టీ అంటే ఏమిటి? జనం- ఆడవాళ్ళూ, మగవాళ్ళూ,

రాయిస్కీ:- కాదు, కాదు.

ఓల్గా:- అయితే మరేమిటి?

రాయస్కీ:- పార్టీఅనేది ఒక చట్రం లాంటిది. ప్రజల్ని కలిపి పట్టుకుందుకు ఉపయోగించే పట్టుకారులాంటిది.

ఓల్గా:- కావచ్చు. కాని, ఒక్కొక్కప్పుడు ఆ కారు మాంసంలో కంటా దిగుతూంటుంది. ఏమయినా మనుష్యులు మనుష్యులే. అందరినీ సమానంగా వుండేటట్లు కత్తిరించివుంచడానికి వాళ

మన్నా పోదలా? ఉదాహరణకి చూడు నీ విషయం...

రాయస్కీ:- నేను అదంతా ఆలోచించేను. ఈ పట్టకారు నా మాంసంలోకంటా దిగుతూనే వుంది. అయినా అది లేకుంటే నేను బ్రతుకలేను.

ఓల్గా:- నీ మాటలేవీ నా కర్థం కావడం లేదు.

రాయస్కీ:- ఇది చాలా చిక్కు విషయం. ఓల్గా! ఈ విషయం ఇంతవరకూ ఇతరులకి చెప్పవలసిన అగత్యం కలగలేదు. ఒక పెద్దగుంపు వుందనుకో. అందులోని జనం అందరూ ఒకేమోస్తరుగా ఒకే ఒడ్డు-పొడుగులలో వుంటారు, అనుకో. అంతే వాళ్ళందరివీ ఒకే మాదిరి మెడపట్టీలు. అందరివీ ఒకే మార్గం. అందరూ ఒకేవిధంగా తూచినట్లు మాట్లాడుతూంటారు, అనుకో. అటువంటి సంఘంలో వుండడానికి నాకు మనస్కరించదు. అందరూ ధరించేమాదిరి మెడపట్టీయే నేనూ నిత్యమూ ధరించవలసి వుంటుందనే వూహ కలిగేటప్పటికి నా ప్రాణం చచ్చిపోతుంది. కాని, నాకు భయం కలిగించే వూహ మరొకటి వుంది. ఓల్గా! ఆ గుంపు నిన్ను విడిచి వెళ్ళిపోతారనుకో. ఆ జనం ఆలాగ ముందుకి జరిగిపోతూంటే నువ్వు, నీ ఆలోచనలూ, అనుమానాలూ, పెట్టుకొని అక్కడనే దిగబడిపోతావు. నువ్వు రాకపోయినా వాళ్ళు ఆగరు. వాళ్ళ పాటలు వాళ్ళు పాడుకుంటారు. వారి మాటలు వారివి. వాళ్ళలో ఒక్కడూ నీకేసి తిరిగిచూడడు. లయత్తో పడే వారి అడు

గులకి దయవుండదు. అందుచేతనే వారి అభిప్రాయాలకీ, నా అభిప్రాయాలకీ, కలయిక లేదనీ, వారి ఆలోచనలకీ నా ఆలోచనలకీ సంబంధం లేదనీ, ఏవేవో కారణాలు కల్పించుకొని వారికి దూరంగా వుండిపోలేను. నేను వాళ్ళని వదలలేను. నాకు సాయం ఉన్నారని నేను అనుకోవాలి. నన్ను ఆజ్ఞాపించగల వారు, నన్ను క్రమశిక్షణలో వుంచగలవారు కావాలి. నన్ను దగ్గరగా చేర్చగల ఇనపగోలుసు లేనిదే నేను నడవలేను.

ఓల్గా:- వారు నిన్ను సరియైన మార్గంలో నడిపించ లేకపోతే?

రాయస్కీ:- నేను వారిని వదలను. వారితోనే చస్తాను. నేను పార్టీకోసం పోరాడేను. నేనొక సైనికుణ్ణి మాత్రమే.

ఓల్గా:- ఎప్పటికేనా జయం వుంటుందనే నమ్మకమయినా లేని సిపాయీవి. ఈలాంటి యోధులు యుద్ధంలో నెగ్గగలరా!

రాయస్కీ:- నాకు జయం కలుగుతుందనే నమ్మకం లేదని నీకెవరు చెప్పేరు! శ్రామికవర్గం జయించరన్న మాట సర్వాబద్ధం! మనుష్యుడికి చావు ఏలాగో, ఆలాగే మనకి విజయం కూడా అనివార్యమే! మనమే- మన రష్యాయే- అంతిమవిజేతలం కాగలమని నమ్మకపోవచ్చు. పన్నెండేళ్ళకాలం ప్రభుత్వం నిర్వహించిన రెండో పారిస్-కమ్యూన్ కావచ్చు. అదే నిజం అయితే నేను చచ్చేటందుకు ఉపాయం చూసుకోవలసిందే.

ఓల్గా:- నీకు పల్లెటూళ్ళకి పోవాలని లేదు కాదు!

రాయస్కీ:- నాకు పల్లెటూళ్ళంటే సరదా లేదు. మంచుతుపానులు, మంచు, వాన, పేరు చెబుతేనే నా కసహ్యం. మనుష్యుడికి స్వాధీనం గాని ఆ మొండి ప్రకృతిశక్తుల్ని నేను సహించలేను...గ్రామాలంటే అలాంటివే! ... వద్దు...నా కవి ఇష్టం లేదు.... అయినా రేపు నే వెళ్ళకమానను.

ఓల్గా:- నీకు తెలిసిందా?

రాయస్కీ:- ఏమిటది?

ఓల్గా:- ఏమీ లేదులే. నాకేమీ పాలుపోవడం లేదు.

రాయస్కీ:- నా గదికి పోతూన్నా. కొంచెం వ్రాసుకోవాలి.

వెడతాడు.

ఓల్గా:- (ఉద్రేకంలో గదిలో పచారు చేస్తుంది. తల వొంచుకొని వుంది. చేతులు కట్టుకొని, కొంచెముగా వొంగి పెరియాని కోవు పారవేసిన కాగితాలవంక చూసి, చదువుతుంది.) "రైతులారా! పార్టీ విజయశంఖం పూరిస్తూంది. ఎర్రజెండా ఎగరవేస్తూంది. పన్నెండేళ్ళ—.

దాషా మైకేలోవులు లోనికి వస్తారు. దాషా, కొన్ని కాగితాలు పెట్టేసి నెమ్మదిగా వెళ్ళిపోతుంది. తన చేతికర్ర మీద ఆనుకుంటూ, మైకేలోవు బల్ల దగ్గరకి వెడతాడు. ఓల్గా అతని వైపు వెడుతుంది.

ఒకరినొకరు సమీపించి ఇద్దరూ నిలబడిపోతారు.

ఓల్గా:- పావేల్ మీదగల అసూయ చేతనా పల్లెటూళ్ళకి తరి మేస్తున్నావు?

మైకేలోవు:- (ఒక్క నిమిషం ఊరుకొని, ఆశ్చర్యంతో ఆమె కేసి చూస్తాడు.) ఈ ప్రశ్న నీ హృదయంలోనుంచే వచ్చిం దని నేననుకోను.

ఓల్గా:- ఆహాఁ, హృదయంలోంచి వచ్చిందే. ..."జిల్లాకమిటీ తీర్మానం ఇదిగో. ఇతడొక్కడే నా వెడుతూంట? పార్టీనిర్ణ యం అది. ప్రజలకి ధాన్యం కావాలి."- ఊఁ. కానీ. చెప్ప వేం? చెప్పు. చెప్పు. నీకేం మాటలకి కొదవా? నీ వ్యాసాల శీర్షికల వంటి మాటలు దొర్లించు. ఊఁ. "పార్టీవిజయశంఖం పూరించుతూంది."

మైకేలోవు:- ఏం. వొంట్లో బాగా లేదా?

ఓల్గా:- నిజంగా! జబ్బుగానే వున్నాను. పైకే తెలుస్తూంది గా. నా తల పట్టుకొని చూడు. నాకు జ్వరం వుందో లేదో తెలు స్తుంది. మైకేలోవ్! జీవితం ఎంత మలకన అయిపోయింది? ఓల్గాకి జబ్బు. రాయస్కీకి ఆకలి. పార్టీ విజయశంఖం పూరి స్తూంది.

మైకేలోవు:- ఓల్గా! మనసు కుదుటపరుచుకో. శంఖం ఏమిటి?

ఓల్గా:- ఒక్క నిమిషం. మైకేల్! ఒక్కనిముషం పార్టీకార్య దర్శివనే విషయం మరచిపోయి మాటలాడు. నా మొహం

చూసి నిజం చెప్పు. పావేలు మీదగల అసూయచేతనే కాదు ఆతనిని తరుముతూంటే? ఊఁ. నిజం చెప్పు.

మైకేలోవ్:- ఏమిటా పిచ్చి ప్రశ్న!

ఓల్గా:- పిచ్చి ఏమిటి, డిమిట్రీ! దాచుతా వెందుకు? నేను గ్రహించలేననుకున్నావా? నీ మనస్సులో దాగిన భావాలు నాకు తెలుసును. ఆతనిని నీ బాటలోంచి తప్పించాలని నీ వ్యూహం. పెద్దమనుష్యులయిన శత్రువులు బహిరంగంగా పోరాడి నెగ్గడానికి ప్రయత్నించుతారు. వాళ్ళు ఒకేరకం ఆయుధాలు ధరించి పోరాడుతారు. కాని, నువ్వు జిల్లాకమిటీ కార్యదర్శివాయె. పార్టీ అలాగ నిశ్చయించిందంటూ నీ స్నేహితుణ్ణి తరిమివేయగలవు. (ఏడుస్తుంది.) పావేల్ రాయస్కీకి ప్రయాణపు టిక్కెట్టా! (మైకేలోవు ఏమీ మాటాడకుండా కర్రమీద ఆనుకొని, నడచివెళ్ళి బల్లదగ్గర కూర్చుంటాడు. ఓల్గా గదిలో పచారుచేస్తూన్న దల్లా నిలబడి ఆతనివంక పరీక్షగా చూస్తుంది.) క్షమించు. నీలో ఏనాడూ కలగడానికి అవకాశం లేని వ్యూహాలు నీ కున్నాయనుకోవడం నా తప్పే. [మైకేలోవు తొందరగా తల ఎత్తుతాడు.] ఔను. నీకు ఈ భావాలు కలుగుతా యనుకోవడం అసహజం. నీకు ఏవిధమయిన భావాలూ కూడా లేవనే నా యనుమానం. నీ అభిమానం అంతా తీర్మానాల మీదా, తీర్పులమీదా, నియమాల మీదా, మాత్రమే వుంటుందనే విషయం మరచిపోయేను.

ఏవో కొన్ని కారణాలచేత నువ్వుకూడా అందరిలాంటి మనిషివే అయినావని భ్రమపడినా. ఇదివరకు పార్టీసూత్రాలకి సజీవరూపంగా వుంటూన్న నీవు ఒక్క నిముషం ఆ స్వరూపం వదిలేసేవని తలచేను. (అరుస్తుంది.) వింటూన్నావా! పార్టీనియమాలకి సజీవమూర్తివి నువ్వు.

మైకేలోవు:- (నెమ్మదిగా) పార్టీ నియమాలకి కూడా మార్పులు వుండకపోవు.

ఓల్గా:- అయితే నువ్వు అదికూడా కావన్న మాట. నీలో మార్పు అనేదే లేదు. విమర్శన, లోకజ్ఞానం, తర్కం, నీ అస్థిచర్మాల్ని పట్టివుంది. నువ్వు కాళ్ళుండి నడవగల ఆజ్ఞామూర్తివి. నీ ఖరాఖండీతనం చూస్తే నాకు డోకువస్తూంది. నువ్వు శకునశాస్త్రంలాంటి వాడివి. ఎక్కడి కక్కడ, ఏ శకునం దగ్గర ఆ శకునం బాపతు ఫలితాలు వ్రాసి పెట్టినట్లు నీలో జీవితసమస్యలు వానికి సరియైన సమాధానాలతో వ్రాసిపెట్టబడి వున్నాయి. నీ భావాలకికూడా అనుక్రమణిక వుంది. రైలుబండీలాగ నీ కోరికలూ, ఆశలూ, ఒకే మార్గంలో, ఒకే నియమితసమయంలో నడచిపోతాయి. అడ్డం రావు.

మైకేలోవు:- నీకు నేను అడ్డంరాను.

ఓల్గా:- ఎన్నో మాటలు నీకు కోపం రప్పించాలని ప్రయత్నించేను. కాని, నువ్వెప్పుడూ లొంగలేదు. నిన్ను అవమానించడానికి ఏం చేయగలనో అన్నీ చేసేను. నిన్ను చికాకు పెట్ట

డం మానవమాత్రునికి సాధ్యం కాదు. నీ ఫోను అజ్ఞలకీ, నీ రిపోర్టులకీ, మినహాగా మిగిలిన ప్రపంచం ఏదీ నీకు తెలియదు. నువ్వు పార్టీయంత్రానివి. ఇంక నిన్ను భరించలేను. (ఒక కుర్చీ లో కూలబడి ఏడుస్తుంది.) ఆఖరుకి నీకు అసూయకూడా కల గదు, డిమిట్రీ!

మైకేలోవు:- ఓల్గా! ఓల్గా! నిజంగానే నీకు శరీరంలో బాగా లేదు. కొంచెం నీళ్ళు తెచ్చిపెడతా నుండు. [లేస్తాడు.]

ఓల్గా:- [గభీమని లేచి నిలబడుతుంది.] నాకు నీళ్ళు తేనక్కర లేదు. దేశంలో ఇప్పుడు జర్నలిస్టులకి వలసినంత పని వుంది. నేను వ్యక్తిజీవితాలు వ్రాస్తాను. రేపు రాయస్కీతో నే గూడా వెడతా.

గిర్రున తిరిగి బయలుదేరుతుంది.

మైకేలోవు:- [ఆమె వెనక నొక అడుగువేసి, దెబ్బ తగిలినట్లు గా కేక బెడతాడు.] అబ్బ!

ఓల్గా:- [వెనక తిరుగుతుంది.] మిట్యా! ఏమిటది!

మైకేలోవు:- విరిగిన కాలుమీద ఆనుకోబోయేను.

ఓల్గా:- [ఆశాభంగంతో] అంతేనా! [వెడుతుంది.]

మైకేలోవు:- [ఒక్క నిముషం ఆమెకేసి చూసి, కర్ర పారేసి కుంటుకుంటూ, బల్లదగ్గరనుంచి ఆమె వెళ్ళిన వైపుకి బయలు దేరుతాడు. టెలిఫోను మ్రోగుతుంది. అతడు ఒక్కనిమషం ఆగి తటపటాయిస్తాడు. టెలిఫోను మళ్ళీ మ్రోగుతుంది.

మైకేలోవు వెళ్ళి రిసీవరు అందుకుంటాడు.] నేనే మాటలా డుతూంట. ...ఔను. హలో! మునిలీ! సాధారణసమావే శానికి రిపోర్టు తయారుచేయాలా? ఇంతకంటె కొంచెం ముం దుగా చెప్ప కూడదు? ... ఊం. చూసేవ్రూ! ఈ పని ఈ వేళకి చేయలేను. ... ఔను. శరీరంలో ఏమీ బాగులేదు. కావాలంటే... బాధ ఏమిటా? ఏమిటని చెప్పను? ... నా గుండెలో ఏదో బాధగా వుందనుకుంటాను. ... ఆస్పిరినా? ఉపయోగించవచ్చు. ... తప్పకుండా తీసుకుంటా. ...... సరే. రిపోర్టు ఇప్పుడే తయారు చేస్తా. సెలవు! [రిసీవరు క్రింద వుంచుతాడు.]

[తెర]

# రెండో అంకం.

మూడో రంగం.

ఒక కులక్-అంటే మాంచి డబ్బుగల పెద్దరైతు, క్వాసోవు ఇంట్లో బాగా అలంకరించబడిన ఒక పెద్ద గది. గదిలోని సామానులన్నీ మంచి పనివాడితనాన్ని ప్రకటిస్తూ, దృఢంగా వున్నాయి. ఒక గోడనిండుగా బొమ్మలు తగిలించి వున్నాయి. ఒకమూలని ఒక బొమ్మ క్రింద దీపం వెలుగుతూంది. ఇవాన్ జిరాసిమోవిచ్ క్వాసోవ్ కొంచెం కాయపారు మనిషి. అరవయిఏళ్ళ వాడు. గడ్డం తీరుగా కత్తిరించబడి వుంది. ఒక షర్టు తొడుక్కున్నాడు. దాని మీద వేస్టు కోటు. ఆతని కూతురు పాషా విసువుతో పేకముక్కలు అటూ యిటూ పడేస్తూంది. ఆమెది ఇరవై యేళ్ళ వయస్సు. అందమైన విగ్రహం. బంగారురంగు జుట్టు వీపుమీద జీరాడుతోంది.

కిటికీవద్ద పిలుపు వినబడుతుంది. క్వాసోవ్ పత్రిక చదువుచున్న వాడల్లా తలయెత్తి చూసేడు. పాషా కిటికీదగ్గరకి వెళ్ళి, తెర తప్పించి, బయట చూస్తుంది.

పాషా:- సోవియటు అధ్యక్షుడు వచ్చేడు. ఆతనితో ఎవరో కాని కొత్తవాళ్ళుకూడా వున్నారు.

డైడోవు:- [తెర వెనకాల] ఇవాన్! తలుపు! చుట్టాలు!

క్వాసోవు హడావిడిగా లేచి తలుపుదగ్గరకి వెడతాడు. గడియతీసి, తలుపు తెరచిన చప్పుడు వినబడుతుంది. రాయస్కీ, ఓల్గా, డైడోవులు లోపలకి వస్తారు. రాయస్కీ నీటయిన తన ఓవర్ కోటు వేసుకున్నాడు. బొచ్చు టోపీకి బదులుగా "హాట్" పెట్టుకున్నాడు. డైడోవు ముసిలివాడు. దయాదాక్షిణ్యాలున్న రైతు. రాయస్కీ చేతిలో సూట్ కేసు ఒకటుంది.

డైడోవు:- ఇక్కడ మీకు చాలా అనుకూలంగా వుంటుంది. ఇవాన్ జిరాసిమోవిచ్ మీ బసకోసం ఒకగది ప్రత్యేకించి ఇస్తాడు. నల్లులూ, అవీ ఉన్నా ... [క్వాసోవుతో] ఈయన జిల్లాపార్టీ ప్రతినిధి, కామ్రేడ్ రాయస్కీ. ధాన్యపు వసూళ్ళకోసం వచ్చేరు.

క్వాసోవు:- ఆయన కేమీ లోటుండదు. కాని, ఏమిటన్నావు? మా నిర్ణయం ప్రకారం ధాన్యం పంపలేదూ?

డైడోవు:- ప్రభుత్వానికి ఇంకా కావాలి.

క్వాసోవు:- మనకి వాళ్ళకంటె ఎక్కువ తెలుసునా యేం? పాషా! ప్రభువులకి పడకగదులు చూపమ్మా!

రాయస్కీ:- ఏ ప్రభువుల్ని గూర్చి మాటలాడుతున్నావు? మా రోజులలో చాలామంది ప్రభువుల్ని నల్లసముద్రంలో ముంచి పారేసేను.

క్వాసోవు:- క్షమించండి, ఏదో పొరపాటు.

ఓల్గా:- (పాషాతో) పెద్ద బాదరబందీ పెట్టుకోకు. నే నిక్కడ వుండగలను లే.

రాయస్కీ:- నీ కిక్కడ అనుకూలంగా వుండదు. నే నీగదిలో వుంటాను.

ఓల్గా:- అబ్బ! పేచీ పెట్టకు. నాకు ఈ గదే బాగుంది. (క్వాసోవుతో) కాని, మీ కింకో గది వుందా? మీ రెక్కడుంటారు?

క్వాసోవు:- ఓ. కావలసి నన్ని గదులు.

రాయస్కీ:- బాగుంది. సరే. అయితే నేనే ఆ గదిలోకి పోతా.

[సూట్ కేసుతో బయలుదేరుతాడు. ఓల్గా వెంబడిస్తుంది.]

క్వాసోవు.- [వెటకారంగా] ఓ. మహావీరుడు.

డైడోవు:- యుద్ధంలో చేసిన ఘనకార్యాలకోసం అతడికి ఎర్ర

జెండా పతకం ఇచ్చేరు.

క్వాసోవు:- సరే గాని, ఇప్పుడేలాగ? చాలా ధాన్యం కావాలంటారా యేమిటి?

డైడ్లోవు:- ఆ ఆజ్ఞ లేవో త్వరలోనే పంపుతారు.

క్వాసోవు:- మైకేల్! ఎక్కడ తెచ్చి ఇయ్యగలం?

డైడ్లోవు:- ప్రభుత్వానికి అవసరం అయినప్పుడు ఎక్కడో ఒక చోట చూసి ఈయాలి.

క్వాసోవు:- మన అదృష్టం బాగా లేదు. ఇదివరకు ఒక పెద్ద ట్రెయిన్ నిండుగా ధాన్యం పంపించలేదు?

డైడ్లోవు:- మళ్ళీ పంపుదాం!

క్వాసోవు:- హారి! అభాగ్యపు రైతా!

తిరిగి వస్తూన్న రాయస్కీ వంక తదేకదృష్టితో చూస్తూ, పాపా గుమ్మంలో నిల్చుంది.

రాయస్కీ:- ఇంక కాలం వ్యర్థం చేయకూడదు. కామ్రేడ్! డైడ్లోవ్! కార్యదర్శికి కబురంపేవా?

డైడ్లోవు:- ఏదీ, ఖాళీ యేదీ? ఇదిగో ఇప్పుడు. ఒక్క క్షణం. పార్టీ సెక్రెటరీనీ, కమ్యూనిస్టు యువజనసంఘ కార్యదర్శినీ, ఇద్దరినీ కూడా వెంటపెట్టుకుని వస్తా.

రాయస్కీ:- సరే. మీ కోసం కనిపెట్టుకొనివుంటా.

డైడ్లోవు:- కామ్రేడ్ రాయస్కీకి ఏదయినా తిండికి ఈయి.

క్వాసోవు:- ఓదో దేవుడిచ్చినదానికి లోపం వుండదు.

రాయస్కీ:- ప్రతిదానికీ బిల్లు చెల్లించేస్తా.

క్యాసోవు:- దాని విషయం అంత పట్టింపు లేదు. ఏదో విశంగా ఆఖరున లెఖ్ఖలు చూసుకోవచ్చు. మాది ఏదో సాధారణపు భోజనం. రైతువాళ్ళం కదా!

పులిసిన మీగడ, రొట్టె, వెన్న, జున్ను, మాంసపుకూరలు, తెచ్చి పాషా వొడ్డిస్తుంది.

రాయస్కీ:- (పదార్థాలవంక చూసి) ఓః. రాజా తిండి. ఏమిటి ఇవన్నీ? వేపుడు ముక్కలా?

పాషా:- మాంసపు వేపడం.

రాయస్కీ:- [ఒకటి తీసి నోట వేసుకొని] చాలా బాగున్నాయి. నీ చెక్కిళ్ళలాగే ఎంత ఎర్రగా వున్నాయో!

పాషా:- నా బుగ్గలు ఇంకా ఎర్రగా వుండేవి. ఇప్పుడు వాడిపోయినాయి గాని.

రాయస్కీ: ఎందుచేత?

పాషా:- మీ భార్యని పిలిచేదా?

రాయస్కీ:- నా భార్యనా? [నవ్వుతాడు.] ఔను. పిలు. పిలు. [కేక పెడతాడు.] ఓ పెళ్ళామా! ఓల్గా! ఓ పిల్లా!

ఓల్గా:- [దుస్తులు మార్చుకొని వస్తుంది.] ఏమిటా వికారం?

రాయస్కీ:- భోజనం వడ్డించేరు. ముద్దుగుమ్మా! పాలు ఆవిర్లు కక్కుతున్నాయి. జున్నుముక్కలు విరిగి కూలుతున్నాయి. ఈ మాంసపు వేపుడు ఎర్రని జ్వాలలా వెలిగిపోతూంది.

ఓల్గా:- ఓ(. రాయస్కీ కవికూడానా!

రాయస్కీ:- ఈ ప్రాతఃకాలపు సౌందర్యం నాలో ఉత్తమ భావాల్ని రేకెత్తిస్తూంది. నేను చేసిన గుర్రపు స్వారీవలన నా నాళాలలో రక్తం పొంగిపోతూంది. ఈ అరణ్యం చూస్తే నాకు ఎంతో సరదాగా వుంది. చూసేవా? ఆ ఆవేశం అణచుకోలేకుండా వున్నాను. అడవి అడ్డపడివస్తూంటే, అది మనల్ని చూసి నవ్వేందా అనిపించింది.

ఓల్గా:- [నెమ్మదిగా నవ్వుతూ] నీ కథుష్లు చూసి ఈ యింటియజమాని పిచ్చివాడనుకొని ఏలాగ తేరిసారి చూస్తూన్నాడో!

రాయస్కీ:- [అదే గొంతుకతో] ముసలివాడు బహు ఉత్తముడు. ఆ పిల్ల చూడు. ఎంత ముద్దొస్తూందో.

ఓల్గా:- నిజమే. అందమయినదే. తిండి తిందాం, రా. పావేల్!

కూర్చుంటూరు.

రాయస్కీ:- [క్వాసోవుతో] మీరు కూర్చోరేం? ఏం పాపా! నువ్వు రావేం?

క్వాసోవు:- నమస్కారం! మేము కోడికూత వేళనే లేచి, చద్ది తినేసేం.

రాయస్కీ:- [తింటూ] అయితేనేం. కూర్చోండి. మీ భార్య కనపడరేం!

క్వాసోవు:- మమ్మల్ని విడిచి వెళ్ళిపోయింది, ఏడాదికిందం.

రాయస్కీ:- [ఆశ్చర్యంతో] ఎక్కడికి పోయింది? ఎవరితోటి?

క్వాసోవు:- ఎక్కడికి పోయిందో ఎవరూ చెప్పలేదు.

ఓ.ల్గా:- ఆమె చచ్చిపోయింది. ఏమిటా తెలివితక్కువ ప్రశ్నలు?

రాయన్స్కీ:- చచ్చిపోయిందా? నా కేం తెలుసు? నేనే మనుకు న్నానో తెలుసునా? ... [తింటూ చెప్పడానికి తటపటా యిస్తాడు.] మీరు సమిష్టి వ్యవసాయ క్షేత్రం ప్రారంభించ బోతున్నారా?

క్వాసోవు:- మా కా సంగతులేమీ తెలియవు.

రాయన్స్కీ:- తెలియడానికి ఏముంది? మీ యంతట మీరే ప్రారంభించవచ్చు.

క్వాసోవు:- మా యంతట మేమా? ఊc? ఔనేమో ... కాని, మా వాళ్ళకి అవేమీ తెలియవు. అమాయకులు. భయస్థులు.

రాయన్స్కీ:- అందులో భయపడడాని కేముంది? వెనకటిలాగే రోజులు గడిపివేయాలని వుందా?

క్వాసోవు:- నిజమే! పూర్వపు రోజులు అంత సుఖంగా గడవ లేదు. అప్పుడేమీ సుఖాలనుభవించలేదు. కాని, మా వాళ్ళు ధోరణే వేరు. వెనకటి పద్ధతులు మాకు బాగా నచ్చేయి. మా తాతలు ఆ మార్గాలలోనే కాలం గడుపుకున్నారు. మా తండ్రులు తమ తండ్రులనుంచి ఈ వారసత్వం సంపాదిం చేరు. వాళ్ళు మాకు ఇచ్చిపోయేరు. కాని, ఈ కొత్త బాట —నిజానికి స్వర్గమే యనండి. అందులో ఎంతమాత్రం సం దేహం వుండదు. - అయినా మా వాళ్ళకి నచ్చదు. మా కీ

భూలోకజీవనమే సమ్మతం అంటారు.

రాయస్కీ:- ప్రతివాడూ నూతనమార్గాలలో జీవించడానికి తగు ప్రయత్నాలు చేయాలిగదా.

క్వాసోవు:- నిజమే. కాని, మావాళ్ళు వట్టిమూర్ఖులు. నీ నెత్తిపై యేదో వుందంటే నీవే తీసివేయ మనే రకం.

రాయస్కీ:- ప్రతివాడూ అలాగే వుంటాడా?

క్వాసోవు:- అంతా ఒకక్కలాగే వుంటారు.

ఓల్గా:- మీ అభిప్రాయం ఏమిటీ?

క్వాసోవు:- మే మెంతవాళ్ళం! మీ రంతా ఏలా వెళ్ళమంటే అలాగ వెళ్ళవలసిన వాళ్ళమే. గాని, ఈలోపుగా మా వెన కటి దారి మామంచనే వుంది.

రాయస్కీ:- సరే, కూర్చోండి. పొదగని గుడ్లు పిల్లల లెక్కలో రావు.

క్వాసోవు:- బాగా చెప్పేరు. కాని, మా కన్నో పిల్లలు మిగ లవు కాదూ?

రాయస్కీ:- పిల్ల లేమిటి!

క్వాసోవు:- మామూలు కోడిపిల్లలే.

పాషా నవ్వుతుంది.

ఓల్గా:- ఏం ఎందుకు మిగుల లేదు?

క్వాసోవు:- నగరంలోని వాళ్ళకే ఎన్నీ చాలడం లేదు. రైతు తిండికి లేనప్పుడు కోళ్ళని అమ్ముకొని ధాన్యం కొంటాడు.

రాయస్కీ:- నిజంగా ధాన్యం అంత తక్కువగా వుంటే......

క్వాసోవు:- ధాన్యం ఆకాశం మీదినుంచి రాలుతుందా యేం?
ధాన్యపు పన్ను ఇచ్చేము. చందా చెల్లించేసేము. అదనపు పన్నులు ఇచ్చేసేము. మా కింక మిగిలేదేమిటి!

రాయస్కీ:- పెద్దరైతుల దగ్గర లేదూ?

క్వాసోవు:- ఏమో, వుంటే వుండొచ్చు.

కిటికీ దగ్గర చప్పుడు.

రాయస్కీ:- (తటాలున లేచి) అయిగో వచ్చేరు.

క్వాసోవ్:- [పాషాతో] తలుపు తెరు!

పాషా తలుపు తెరుస్తుంది. స్థానిక కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి లోక్టేవునీ, యువజనసంఘ కార్యదర్శి జొటోవానీ, వెంటబెట్టుకొని డైడోవు ప్రవేశిస్తాడు. ఇద్దరూ రైతులే. విప్లవం ఇరువురిలోనూ కూడా గొప్పమార్పు తెచ్చింది. లోక్టేవు నున్నగా గడ్డం గీసుకున్నాడు. ముప్ఫయి ఏళ్ళుంటాయి. శుభ్రమైన దుస్తులు. చురుకైన కళ్ళు. జొటోవా దృఢశరీరంగల పడుచు. కళ్ళలో చురుకుదనం ప్రతిబింబిస్తూంది. వారి వెనకనే పాషా తిరిగివస్తుంది.

డైడోవు:- [వేళాకోళంగా] ప్రజ ఎన్నుకున్న కమిస్సారులంతా

వచ్చినట్లే.

లోక్టేవు:- సిబ్బంది అంతా వచ్చింది. [రాయస్కీతో కరస్పర్శ చేస్తాడు.]

జొటోవా:- కమ్యూనిస్టు యువజన సంఘ కార్యదర్శిని, మీరు ఏం చెప్పినా చేయడానికి సిద్ధం. [చేయి కలుపుతుంది.]

రాయస్కీ:- కామ్రేడ్స్! ఇంక ప్రారంభించుదమా! (లోక్టేవు ఓల్గా వంక పరిశ్నార్థకంగా చూస్తాడు. అది గమనించి,] ఈమె కామ్రేడ్ జెలోజరోవా. జిల్లాపత్రికకి సంబంధించి యున్న మనిషి. ఓల్గా! నువ్వు చేస్తూన్న దెంత మంచిపనో ఎరుగుదువా? [అందరూ బల్ల చుట్టూ కూర్చుంటారు. డైజోవు క్యాసోవుకి సంజ్ఞ చేస్తాడు. పాషాతో సహా అతడు గది విడిచిపోతాడు.] ఇంక మన పని చూసుకుందామా? మీరు ఇరవైయొక్క వేల పూడుల ధాన్యం పంపించేరు.

డైజోవు:- ఇరవైయొక్క వేయీ, ఒకవంద.

రాయస్కీ:- సరే. ఇంక వాళ్ళదగ్గరున్న దానిలో మరొక ఏడు వేల పూడులు వసూలుచేయాలి.

డైజోవు:- ఏడు వేలే!

జొటోవా:- ఏడు వేలు తీసుకోవచ్చు. పెద్దరైతులే దరిదరిగా ముప్ఫయి వేలదాకా దాచేరు.

లోక్టేవు:- (బెదిరింపుగా) జొటోవా!

జొటోవా:- పోనీ ఇరవయ్యే అనుకో.

లోక్టేవు:- ఇరవయ్యా!

జొటోవా:- పోనీ, పదిహేనే అను. ఎంతయితేనేం! కొనక పోలేదు గదా!

లోక్టేవు తలవూపి తేరిపారిచూస్తాడు.

డైడోవు:- మావూళ్ళో ఏడు వేలు వుండవు. కాని, ఏలాగో ఒక లాగు పోగుచేయాలి.

లోక్టేవు:- ధాన్యం లేకపోలేదయ్యా డైడోవు! నీకా భయం అవసరం లేదు.

డైడోవు:- ధాన్యం వుండనీ - వుండకపోనీ ఒక్క పని మాత్రం నిశ్చయం. త్వరలో అన్నీ పోగుచేసి తెస్తాము.

రాయస్కీ:- పోగుచేయడం అంత పైపైగా లేదు. కామ్రేడ్స్! ఏవిధంగా వసూలుచేయాలో కూర్చొని మాటలాడుకుందాం.

డైడోవు:- మాటలాడుకోనడానికి ఏముంది. ఇంత వసూలు కావాలని చాటించుదాం. అంతే.

లోక్టేవు:- అది పద్ధతికాదు.

జొటోవా:- అదంతా ఒక్క కులక్కులదగ్గరనే పోగుచేద్దాం. గ్రామంలో సగంమంది కులకులే. మిగిలినవాళ్ళు గొర్రెల మాదిరిగా వారివెనక్కాలే వుంటారు.

లోక్టేవు:- (అసహ్యంతో) సగంమందా!

జొటోవా:- నువ్వు ఇక్కడికివచ్చి అట్టేకాలం కాలేదు. నీకు అట్టే తెలియదు. ఊరంతా కులకులే. కొంచెం బయటికి

వెళ్ళి, చాటుగా నిలబడి వాళ్ళు చెప్పుకొనే మాటలు విని చూడు. అనేకరకాల కులకులు. అనేకరంగుల జనం ఇక్కడ వున్నారు. ఇక్కడ ఇరవైమంది రక్షకుల్ని పెట్టుకోవలసి వచ్చింది, తెలుసా?

డైడోవు:- ఏడుగురేలే.

జొటోవా:- ఏడుగురా. అదేం అంత తేడాకాదులే. మనం బలవంతంగా ధాన్యం వసూలు చేయవలసి వస్తుంది. మనం ఆయుధాలు తీసుక తప్పదు.

లోట్కేవు:- వసపోసిన పిట్టలాగ ఒకటే వాగుడు. కళ్ళు చూస్తే కిర్గిందూ వీడూ తెలియదు. అందులో వొక్కటీ ఉపయోగించేది లేదు.

రాయస్కీ:- నీ అభిప్రాయం ఏమిటి?

లోట్కేవు:- ఈ ధాన్యం చాలవరకు కులకులనుంచే వసూలుచేయాలి. కాని, వాళ్ళు ఒకపట్టాన వదులుతారూ? ఒక పెద్దపేచీ లేవదీస్తారు. అంనుచేత కొన్నాళ్ళపాటు ప్రచారం సాగించడం అవసరం.

రాయస్కీ:- కొంతకాలం అంటే? వసూలు చేసే ముందా?

లోట్కేవు:- ఏ పని చేసేటందు కయినా సరే ముందు.

రాయస్కీ:- ఆటుతరువాత కొంతకాలంపాటు వసూళ్ళా?

లోట్కేవు:- ముందు రంగం తయారు కావాలా? అప్పుడు వసూలు చేయడం సులభం. ఏ తయ్యారీ లేనిదే పేచీకి దిగడం ప్రమా

దకరం. తెరచాప లన్నీ దింపండి. తాడూ, తంపరా, గట్టిగా వుందో లేదో చూసుకోండి. వచ్చే తుపాను నెదుర్కోవాలి.

రాయస్క్:- మన కూలీలంతా అంతవరకూ నోట్లో వేలు పెట్టుకొని కూర్చోవలసిందేనా? నీ తెరచాపలు దింపి, చుట్టుకొని, జాగ్రత్త పడేదాకా వాళ్ళని తిండీ తిప్పలూ మాని పస్తుండమంటావా?

డైకోవు:- ఇంత చర్చకి అవసరం ఏముందీ? ప్రభుత్వం ధాన్యం కావా లంది. మనం తెచ్చి ఇయ్యాలి. రేపో సభ చేద్దాం. అంతేనా?

లోక్టేవు:- వీూ యిష్టం. కాని, ఫలితం వుంటుందనుకోను. ఇటిక గోడని తలకాయతో కొట్టి కూలదోయ బోయినట్లుంటుంది.

రాయస్క్:- నువ్వింకా వెనకటి పుంతలోనే వున్నావు. కామ్రేడ్! దెబ్బలాట వస్తుందని ప్రక్కకి తప్పుకోడం సరియైన పనా?

లోక్టేవు:- రంగంలోకి దిగేముందు తనబలం దృఢపరచుకోడం తప్పు పని కాదు.

రాయస్క్:- మనం దాడి ఆరంభించేము. మన పార్టీ మనల్ని అప్పుడే ముందుకి పంపింది.

లోక్టేవు:- నిజమే! కాని, రైతులందరినీ ఒకటి రెండుమారులు పిలవడం నచ్చచెప్పడం- మధ్యతరగతి రైతుని కూడా పిలిచి బోధించడం అవసరం. లేకుంటే కులక్ వీరందరినీ తాను

చేరదీస్తాడు.

రాయస్కీ:- నీ వ్యూహనిర్మాణం బాగాలేదు. కామ్రేడ్! దీన్ని పట్టి చూస్తే నువ్వెన్నడూ యుద్ధంలోకి పోలేదని తెలుస్తూ వుంది.

లోకేవు:- పొరపాటు. ఐదేళ్ళు రంగంలో వున్నా.

రాయస్కీ:- అయితే పాఠం బాగా చదవలేదన్న మాట. ఎప్పుడూ శత్రువుని హఠాత్తుగా ముట్టడించాలి. అతడు పడక కుర్చీలో కూర్చుండి విశ్రాంతి తీసుకుంటూ వుండగానే, తల నువ్వుకుని ముస్తాబవుతూండగానే, మనం దండయాత్రి సాగించాలి. మనం ఈ వేళ అప్పుడే దండయాత్రకోసం ఓడ కెక్కేము. మనం హఠాత్తుగా ఎదురొక్కని మీదపడాలి. శత్రువుకి సర్దుకొనేటందుకు అవకాశం ఈయకూడదు. మా కులకులు నిద్ర పోతూంటారు. హంసతూలికా తల్పాల మీద ఆ శరీరాలు పారేసి విశ్రమిస్తూంటారు. హఠాత్తుగా అలాగంటి సమయంలో మనం యుద్ధభేరీ వాయించాలి. ఒకటి. తప్పితే రెండు. మొదట మాటింగు. వెంటనే వసూలు. ఒక వేళ లేచి కులక్ సహాయం కోసం అర్చినా సమయం మించిపోతుంది. మనం ఇదివరకే ఆ తయారీలేవో చేసుకొని వుండవలసింది. ఏమేం యెత్తులు వేయవలసిందీ నిశ్చయం చేసుకోవలసింది. సరే, అంతా పూర్తయినట్లేనా! రేపు. ఎనిమిదింటికి. ఇంక. (లేస్తాడు.)

జొటోవా:- [లోక్టేవుతో] నీకు తగిన మనిషి.

డైష్టోవు:- నీ ఆజ్ఞ ప్రతిఅక్షరం నిర్వహించుతాం.

లోక్టేవు:- రేపు మళ్ళీ (విసువుతో) కేవలం...

రాయస్కీ:- సెలవు. ఏదో ఉపన్యాసం ఇచ్చేసనకోకు. అది నీ మంచికే.

లోక్టేవు:- తప్పేమిటి? సెలవు!

జొటోవా:- ఈ వేళ క్లబ్బులో ఒక నాటకం ఆడుతూన్నాం. మీరు వస్తారా?

రాయస్కీ:- తప్పకుండా... మే మిద్దరం కలిసేవస్తాం, నేమూ ఓల్గా. వేసే వారెవరు?

జొటోవా:- మా వూరి వాళ్ళే. కాని, మంచి అలవాటున్నట్లు బాగా వొప్పించుతారు. కూర్చున్న జనం అంతా కళ్ళనీళ్ళు పెట్టవలసిందే.

లోక్టేవు:- నిజమే ఆ మాట. ఆ ఆట చూసినప్పుడు నవ్వవలసిన చోట ఏడుపు, ఏడవ్వలసిన చోట నవ్వూ వస్తుంది.

జొటోవా:- నీ కన్నీ వేళాకోళమే. నీవలన కొంచెం కూడా ఉపకారం లేదు. సలహా అంతకంటె లేదు. వేళాకోళం-వెటకారం, అంతే. [వెడుతుంది.]

లోక్టేవు:- [రాయస్కీ చేయిపట్టుకొని] కామ్రేడ్! ఆయుధాల మాట ఏమిటి? మనకి వెపన్కాల ఆసరా వుండొద్దూ? ఆ జాగ్రత్త అవసరం.

రాయస్కీ:- నేనేం చంటి పిల్లవాడిని గాను. [లోక్టేవు-డైడో వులు వెళ్ళిపోతారు. ఓల్గాతో] పార్టీ కార్యదర్శి వస్తే పిరికి పంద. మార్గం సరిచేయడానికి మీటింగులు చేస్తూ ఎన్నో రోజులు గడుపుతాడుట. నే నన్ని పనులూ మూడు రోజుల్లో ముగించేస్తా. నాకు నాలుగు వూళ్ళు వొప్పచెప్పేరు. నాకు ఇచ్చిన వ్యవధిలో పది వూళ్ళ పని నిర్వహించగలను. మిగిలిన వాళ్ళ చురుకుదనం అంటే ఏలాగుంటుందో ఈ కంచర గాడిదలకి చూపుతా.

ఓల్గా:- నీ మాట లెంత బాగుంటాయి! ఎంతవుత్సాహం, ఎంత ధైర్యం, వుంది నీలో?

రాయస్కీ:- అనుకుంటే వెనక్కి తిరిగే మనిషిని కాను.

ఓల్గా:- ఔను. నువ్వే సరి అయిన వాడివి. నిన్ను కలుసుకో గల ఆశ వొదులుకున్నాను.

రాయస్కీ:- నన్నా?

ఓల్గా:- ఔను. నిన్నే. నీ మాదిరి మనిషినే...

రాయస్కీ:- ఏం! ఎటువంటి వాడినేం నేను?

ఓల్గా:- నువ్వు ... నువ్వు ... చెప్పడానికి మాటలు దొరకడం లేదు ...

రాయస్కీ:- కాని, ఓల్గా! మనం ఇకముందునుంచీ కలిసివుందాం. ఏమంటావు?

ఓల్గా:- నీ వుద్దేశం ఏమిటి!

రాయస్కీ:- ఇదీ! [హఠాత్తుగా ఆమెని పట్టుకుని ముద్దుపెట్టుకుంటాడు.] ఓల్గా! ఓల్గా! నా ముద్దుఓల్గా! మన నాళాల్లో ప్రవహిస్తూన్నది నీరు కాదు. రక్తం! డబ్బుతో విలువకట్టరాని రక్తం! [మళ్ళీ ముద్దు పెట్టుకుంటాడు. ఓల్గా తప్పించుకుంటుంది. రాయస్కీ ఆమె వెంటపడతాడు. ఇద్దరూ ఒకరి వెంట నొకరు బల్లచుట్టూ పరుగెత్తుతారు. ఆమెని పట్టలేక రాయస్కీ బల్లమీదుగా గెంతుతాడు. అదే సమయంలో హాలులోనికున్న ద్వారం తెరుచుకొని జోగినియైన మోక్రీనా ప్రవేశిస్తుంది. రాయిలా పాతుకుపోయినట్లు గుమ్మంలో నిలబడి పోయి, మొగానికి చేతులు చాటు చేసుకుంటుంది. ]
మాతాజీ! ఏం కావాలి?

మోక్రీనా:- [లెంపలు వేసుకుంటూ] పాపం శమించు గాక! పాపం శమించు గాక! ఓరీ సైతాన్!

రాయస్కీ:- [నవ్వుతూ] పాపం శమించు గాక! [బల్లమీది నుంచి ఉరుకుతాడు.]

మోక్రీనా:- ఓరి పాపీ! నా దగ్గరికి రాకు. [ఆతనికేసి చేతులు తిప్పి గాలిలో శిలువ గీస్తుంది.]

రాయస్కీ:- ఏం కావాలి నీకు.

మోక్రీనా:- తుచ్ఛుడా! నీ కిక్కడేం పని! పాపీ! ఎందుకు వచ్చేవు! ఏమిటీ దిక్కుమాలిన పతకం! ఇల్లంతా ఏమిటీ గంతులు! ఫో. ఇక్కడినుంచి పో.

క్యాసోవు:- [పాషాతో గదిలోకి వస్తాడు. పాషా గుమ్మంలో నిలబడుతుంది.] అమ్మా! మీ గదిలోకి మీరు వెళ్ళండి. [రాయస్కీ-తో] ఆమె ఒక జోగిని. నన్ను చూడడానికి వచ్చింది. రాత్రిం బగళ్ళు నిరంతరం భగవద్ధ్యానం తప్ప మరొకటి వుండదు.

ఓల్గా:- ఆమె కళ్ళలోని వెలుగు చూసేవా? ఎంత వయస్సుంటుందంటావు? బహుశా చిన్నవయస్సుదే అయివుంటుంది.

క్యాసోవు:- నేనెప్పుడూ ఆ విషయం తెలుసుకోడానికి ప్రయత్నించ లేను.

రాయస్కీ:- దాన్ని చావనీ, మన కెందుకు? ఓల్గా! షికారు పోదాం, రా. ఊరిబయట చిట్టడవు లున్నాయి. మంచు దట్టంగా, అందంగా వుంది. రా. పోదాం.

ఓల్గా:- మాతో నువ్వుకూడా రా, పాషా!

పాషా:- నే రాలేనమ్మా!

రాయస్కీ:- ఔను. నువ్వు కూడా రావాలి. ఆ యడవులు చూపింతువు గాని.

పాషా:- అదిగో అడవి. నా సహాయం అవసరం లేకుండానే మీరు దానిని కనుక్కోగలరు. ఎడ మధ్యాహ్నం తిరగడం నా కలవాటులేదు.

రాయస్కీ:- ఏమి టింత విచారంగా వున్నావు? పాషా! కాస్త సరదాగా వుండాలి. స్నేహితులతో కలిసితిరగాలి.

పాపా:- సరదాతో కడుపు నిండదు.

రాయస్కీ:- నీ కేం గావాలి?

పాపా:- ఏం కావాలా? ఏమి టక్కర్లేసు? చూడు. ఈ యింటి ద్వారాలూ అవీ తలకి తగిలేలా వున్నాయి. ఇంతకంటె పెద్ద ఇళ్ళలో వుండాలని వుంది.

రాయస్కీ:- మీ తండ్రితో చెప్పకపోయావా? ఆయనే ఎత్తు చేయించును కాదూ?

పాపా:- చూ నాయనా? ఆయనగారు ఎన్నడూ అలాగంటి పని చేయడు.

క్వాసోవు:- పాపా! నీ పని నువ్వు చూసుకో.

ఓల్గా:- ఏమి టంత మునిగిపోయే పనులేమన్నా వున్నాయా?

క్వాసోవు:- పొలం పనులు తప్ప మా కుండే ఇతరపను లేమిటి? మీతో ఆయుధా లేవయినా తెచ్చుకున్నారా? అంత చను వుగా అడిగినందుకు క్షమించండి. మీ యింటి పేరేమిటో నాకు తెలియదు.

రాయస్కీ:- నన్ను కామ్రేడ్ రాయస్కీ అంటారు.

క్వాసోవు:- కామ్రేడ్ రాయస్కీ! అధమం ఒక పిస్టలయినా కూడా వుంచుకో.

రాయస్కీ:- ఏమిటా మాట పట్టుకొని రాపాడించేస్తున్నావు? ఇక్కడేమయినా గందరగోళం వచ్చేలావుందా?

క్వాసోవు:- ఉహుం. గందరగోళం అనేది ఈ వూర జరగదు.

కాని. నీ పని వుందే అది అలాగంటిది. ఏంజరిగినా జరగొచ్చు.

రాయస్కీ:- మరేం ఫర్వాలేదు. ఓల్గా! నడు, పోదాం. పాషా! విచారంగా వుండకు. [ఆమెకేసి చేయి వూపుతాడు.]

అతను ఓల్గాతో కలిసి వెళ్ళిపోతాడు. పాషా తనచోటినుంచి కదలకుండా అలాగే నిలబడిపోయి వుంటుంది. క్వాసోవ్ కిటికీదగ్గరకు వెళ్ళి వారిద్దరూ దూరంగా పోయేదాకా చూస్తాడు.

పాషా:- అతడి దగ్గర రివాల్వ రుందో లేదో నీ కెందుకు?

క్వాసోవ్:- [నెమ్మదిగా ఆమెకేసి తిరిగి] ఏమిటన్నావు?

పాషా:- వినబడనట్లు నటించకు. ఏదో ప్రయత్నాలు సాగించుతూన్నట్లుంది.

క్వాసోవ్:- [నెమ్మదిగా] పాషా! ఈ సంజాయిషీ ఎవరినుంచి అడుగుతున్నావో తెలుసునా?

పాషా:- నీ నుంచి! క్వాసోవ్ ఇవాన్ జెరాసిమోవిచ్ నుంచి! నా తండ్రి నుంచి!—

క్వాసోవ్:- మన ప్రభువుకి కోపిష్టివాళ్ళంటే అయిష్టం! పాషా! అటువంటి పాపపు పని నా చేత చేయించకు.

పాషా:- [కోపంతో] ఆతని తలమీది వెంట్రుకని కదిలించినా జాగ్రత! ఇవాన్! నీ తల సంగతి ముందు ఆలోచించుకో. నేను అటువంటి పని జరగనీయను. [వెడుతుంది.]

క్సాసోవు:- నువ్వు జరగనీయవేం? అయితే గాలి ఈ మూలకుంది! ... ఓసి ముండా! వెళ్ళి ఆయంగారినే అడగకపోయేవా! పట్టణానికి తీసుకుపోయి పెద్దభవంతి బహుమతీ చేసునే! ఆ యింటి ముందర వీధిలో పచారు చేయవచ్చు. నిన్ను వాడు లంజని చేసి వదిలిపెడతాడు.

పాషా:- [గది లోనికి ఒక్క పరుగున వచ్చి, క్సాసోవు మొగం మీద మొగం పెట్టి పెద్దగా అరుస్తుంది.] ఏమిటీ అన్నావు!

క్సాసోవు:- ఎందు కమ్మా! ఎందు కా కోపం? ఇప్పుడు...ఉఁ. ఇప్పుడు... [పాషా బయలుదేరుతుంది.] నువ్వు అలాగంటి ప్రశ్న వేయకూడదు. మనం ఏలాంటి వాళ్ళం? ఎప్పుడేనా ఎవరినేనా చంపేమా? మనకి మాత్రం ఆ పరమేశ్వరుడు ఆత్మ నీయలేదూ? [పాషా ఒక పొట్టిజాకెట్టు తొడుక్కొని రుమాలొకటి తలకి చుట్టుకుంటుంది.] ఎక్కడికి ప్రయాణం?

పాషా:- అంకాగారి యింటికి.

క్సాసోవు:- వెళ్ళి రా పాషా! వెళ్ళేదానివి ఏలాగూ వెడుతు న్నావు. మైకేల్‌ని నేనో మాట రమ్మన్నానని చెప్పి, పంపు. గ్రింకిన్ ఇంటి దగ్గరకూడా ఓ కేక పెట్టు. అతనితో మాట లాడవలసిన పని వుంది. పంపుతావా?

పాషా:- పంపుతాను లే! [వెడుతుంది]

క్సాసోవు:- [సావిడిలోకి వెళ్ళి ఆమెని పంపి తలుపు గడియ పెడతాడు. అక్కడినుంచే అతని మాటలు వినిపిస్తూంటాయి]

నేను పెంచి, పోషించిన కూతురు వరస కులాగ వుంది. రాక్షసి విత్తనం. [వస్తాడు.] ఏమయినా నా రక్తసంబంధం కదా! [గట్టిగా] అమ్మా! మాతాజీ!

మాక్రీనా:- [లోనికి వస్తుంది.] ఇదిగో వచ్చేను.

క్వాసోవు:- ఆత్మరక్షణ కిది సమయం. నగరంనుంచి మహామంచి బహుమతీ వచ్చింది. మన పాతర లన్నీ తుడిచిపెట్టేటందుకు పాలికట్టు వచ్చింది. వాళ్ళు మనధాన్యం దోచుకుపోడానికి వచ్చేరు.

మాక్రీనా:- ఆ వెధవపతకం వాడూ ఆ వెర్రివాడేనా?

క్వాసోవు:- కమ్యూనిస్టు ముద్రమ్మా, అది! సర్వాధికారాలూ వాడి చేతిలో పెట్టేరు. సోదా చేయకుండా ఒక్క- ఇల్లు కూడా వొదలడు.

మాక్రీనా:- అయితే ఏలాగ?

క్వాసోవు:- ఆత్మరక్షణకి దిగవలసిందే! వెళ్ళి ఆడవాళ్ళ నందరినీ పిలు. వాళ్ళు కళ్ళు తెరచేలాగ చేయి. రేపటి మీటింగు వేళకి వాళ్ళకి ఈ సంగతులన్నీ అవగతం కావాలి. ఆ సభ పెడుతూన్న దెవరో, ఒందుకు పెడుతూన్నారో, సమస్తం తెలియాలి. వెళ్ళు. మాతుష్కా! త్వరగా వెళ్ళు.

మాక్రీనా:- సెలవు. ఇవాన్! ఇంకా ఒక రాత్రీ పగలూ మనకి అవకాశం వుంది. ఆ సర్వరక్షకుడు మనని రక్షిస్తాడు.

క్వాసోవు:- ఆతను దయామయుడు. [ఆమె వెనకనే వెడతాడు.

తలుపు గడియవేసిన చప్పుడు వినబడుతుంది. అతడు తిరిగి వచ్చి, కిటికీలోంచి బయటికి చూస్తాడు.] తిరుగు. కామ్రేడ్! తిరుగు! షికార్లు కొట్టు. మా పూళ్ళో మంచి అడవులున్నాయి. మేము హంసతూలికా తల్పాల మీద శరీరాలు పారవేసి దొర్లుతూంటే- మేము తలలు దువ్వుకుని ముస్తాబవుతూ వుంటే- మేము—

తలుపు దగ్గర చప్పుడు. క్వాసోవు తలుపు తీసి, పాషానీ, ఆమె సోదరుడు మైకేల్‌నీ, గ్రన్‌కిన్‌నీ, ప్రవేశపెడతాడు. మైకేల్ పాషాకంటె కొంచెం పెద్ద. గోముగా పెరిగేడు. పల్లెటూరివేషం. కాలిని జోళ్ళు మెరుస్తున్నాయి. గ్రిన్‌కిన్ బీదరైతు. అదో రకం మొద్దు. కుటిలులయిన కులక్కులు చెప్పిన దానికల్లా తల వూపుతూంటాడు.

—లోనికి రావయ్యా! నేస్తం! [ఈ మొగ మెచ్చు మాటలతో గ్రన్‌కిన్ ఉబ్బిపోతాడు. కూర్చుండడానికి ఒక మంచి కుర్చీ చూపుతాడు.] కూర్చో. ఈలాగ కూర్చో.

అందరూ కూర్చున్నాక పాషా వెళ్ళిపోతుంది.

—అబ్బ! ఏలాంటి రోజులు వచ్చిపడ్డాయి. [నిట్టూర్పు.]

గ్రిన్‌కిన్:- నాకు తెలుసును.

క్వాసోవు:- నీకూ తెలుసునూ? బాగుంది. బాగుంది. ఆఖరుకి ఏమవుతుం దంటావు?

గ్రన్‌కిన్:- నాకేమి తెలుసు?

క్వాసోవు:- నాకు తెలుసును సుమీ! మనందరికీ చిప్ప చేతికి వస్తుంది. రైతువాడి శరీరంలో ఒక్క బొట్టయినా మిగల కుండా రక్తం పిండుతారు. ప్రభుత్వం నీ ధాన్యానికి ఏమిటి స్తున్నారు!

గ్రన్‌కిన్:- పూడుకి ఎనిమిది రూబుళ్ళు.

క్వాసోవు:- నేను? నే నెంత ఇచ్చేను?

గ్రిన్‌కిన్:- అరవయి రూబుళ్ళు.

క్వాసోవు.-.ఏం? ఎందు కంత ఇచ్చేను? గ్రన్‌కిన్! రైతు లెంత శ్రిమపడి పని చేస్తారో నాకు తెలుసును గనక. నేను కూడా తెల్లవారకుండా లేచి, పొలం పోయివాడినే గనక! చెమటోడ్చి భూమి దున్నుతున్నాను గనక! నీ అవస్థా అంతే! మన చెమట, కన్నీరు, పడి భూములు ఉప్పబడిపోయేయి. కాని, ఈ ధాన్యం ఉడక పెట్టి మాస్కోలో గుర్రాలు మేపుతున్నారు. ఈ ధాన్యంకోసం ఎంత శ్రిమపడ్డామో వారికేమయినా తెలుసునా?

గ్రన్‌కిన్ :- అయితే మాత్రం మనం ఏమి చేయగలం; మన చేత్తో మనం ఇవ్వకపోతే వాళ్ళే తీసుకుపోతారు.

క్వాసోవు:- ఎందుకు తీసుకువెళ్ళాలి; ధాన్యం లేనప్పుడు తీసు

కొనే దేమిటి; నిక నేర్! మన మందరం పరస్పరసహాయం చేసుకోవాలి. ప్రతివాడూ అందరికోసమూ, అందరూ ప్రతి వాడికోసమూ, పని చేయాలి. అన్నిటికంటే ముఖ్యమయిన విషయం ఏమిటంటే, మనలో మనకి కలతలు కలగచేయకుం డా జాగ్రత్తపడాలి. మన కుటుంబాన్ని ధ్వంసం చేయనీయ కూడదు. మనలో ఒక్కడు మన గుట్టుబయట పెట్టినా అం దరం చచ్చేమే.

గ్రన్‌కిన్:- మీ ధాన్యం విషయంలో నే నేమి చేయగలనో చెప్పండి!

క్వాసోవు:- నిక నేర్! నా ధాన్యం నీ పాతరలలో దాచు. నీ యింట చోటు లేకపోలేదు. ఒకవేళ నీ యిల్లుకూడా వెతి కేరా, ఆ ధాన్యం నీదే నని చెప్పు. వాళ్ళకి నీ దగ్గరనుంచి లాగుకొని పోవడానికి హక్కు లేదు.

గ్రన్‌కిన్:- అలాగే.

క్వాసోవు:- రేపు మీటింగుకి రా. మిగిలిన వాళ్ళ నందరినీ వెంట తీసుకురా. రైతువాడి బుర్ర మన్ను తింటూందని వాళ్ళ అభిప్రాయం. తమ పొరపాటు త్వరలోనే తెలుసుకొనేలా చేయాలి.

గ్రన్‌కిన్:- సరే. సెలవు.

క్వాసోవు:- దేవుడు నీ కెన్నడూ ఏ లోటూ చేయడు. మళ్ళీ నువ్వు మా యింటి ఛాయల కయినా రాబోకేం! (ఆతని పంపి

వేసి తిరిగి వస్తాడు.) మిషా! ఇక ఆఖరు ప్రయత్నం చేసి చూడాలి. వాళ్ళు మనల్ని లెక్క చేయరు. ఊరి కంతకీ ఓ అరవయి మందిని ఏరి వాళ్ళ దగ్గర వసూలు చేస్తారు.

మైకేల్:- ఏం. చాలా అడుగుతున్నారా?

క్వాసోవు:- ఏడు వేలు.

మైకేల్:- అయ్య బాబోయ్!

క్వాసోవు:- వెంటనే ఊళ్ళో వాళ్ళందరినీ పిలవాలి. ఇంక ఈ వేళకి నిద్ర లేదు. మనం సాధించవలసిందొక గొప్పసమస్య.

మైకేల్:- ఈ ప్రతినిధి ఏలాంటివాడు?

క్వాసోవు:- అగ్నిహోత్రం. అయినా ఆగ్రహగలం.

మైకేల్:- లంచం తీసుకుంటాడా?

క్వాసోవు:- మనం ఎలకల మాదిరిగా మెత్త మెత్తగా వూరుకుంటే పిల్లిలా వెంటపడతాడు.

మైకేల్:- అయితే నువ్వనుకుంటూన్న ప్లాన్ ఏమిటి?

క్వాసోవు:- నాకో చిన్న వూహ తోచింది. ఆహా! రైతువాడికి ఎంత దుర్గతి వచ్చింది! (లేచి నిలబడి పాషా వెళ్ళిన గదివంక నడుస్తూ, నెమ్మదిగా) రహస్యం! మన పిల్లికూన వుండే ...

మైకేల్:- [ఆశ్చర్యంతో, నెమ్మదిగా] ఏమి టంటావు!

క్వాసోవు:- ఏమీ లేదు లే. ... మన పాషాకి ఒళ్ళు తెలియడం లేదు. ...... మీటింగు రేపు జరుగుతుంది. ...... [మైకేల్ కేసి వొంగి చెవిలో గుసగుసలాడుతాడు.] మిషా!

నే చెప్పేది శ్రద్ధగా విను. ......

ముసలివాడేదో చెబుతోంటే మైకేల్ మొగం మీద నవ్వు కనబడుతుంది. తెలిసినట్లుగా తలవూపి వెళ్ళిపోతాడు.

[తెర]

# మూడో అంకం.

## నాలుగో రంగం.

గ్రామంలో రచ్చ బయలు. సభ జరుగుతోంది. వెనకిగా గుమ్మటంతో వున్న చర్చీ, కో-ఆపరేటివ్ స్టోర్సు, వున్నాయి. చర్చి ప్రస్తుతం సోవియట్ కార్యాలయంగా మార్చబడింది. దానిమీద ఎర్ర జెండా లెగురుతున్నాయి. గోడలికి నోటీసు లంటించబడివున్నాయి. చాలామంది వ్యవసాయదారులు స్త్రీ పురుషులు బెంచీలమీదా, కుర్చీలమీదా, కూర్చుని యున్నారు. కొంచెం దూరంలో క్వాసోవు ఒక దుంగ మీద కూర్చుని యుంటాడు. జుబోవు కూడా అక్కడనే కూర్చుని యున్నాడు. వాళ్ళు కులక్‌లని ఊరంతా ఎరుగునుగనక ఆ సమావేశంలో వారు కలియలేదు. పడుచుకారు కుర్రవాళ్ళంతా హాస్యా

లాడుకుంటూ కిచకిచ లాడుకుంటున్నారు. డైడోవు, రాయస్కీలు సభా వేదికమీద నిల్చున్నారు. సభా వేదికకి దిగువనున్న బెంచీమీద ప్రజలకేసి తిరిగి ఓల్గా, లోక్లేవ్, జుటోవా, ఇంకా ఎందరో కమ్యూనిస్టు యువతీయువకులు కూర్చున్నారు. సభ చాలా అలజడిగా వుంది.

డైడోవు:- గ్రామస్థులారా! మీ రంతా కామ్రేడ్ రాయస్కీ చదివిన రిపోర్టు విన్నారు కదా! ధాన్యం వసూలు చేయడానికి ఈయన్ని ప్రభుత్వం ప్రత్యేకంగా పంపించేరు. మీలో ప్రతివారూ ప్రభుత్వానికి ఎంతెంత ధాన్యం, ఎంతెంత గోధుమ అమ్మాలో అంచనా తేల్చేము. నేనా పట్టిక చదువుతాను వినండి.

కోటికెన్:- ప్రశ్న లేవయినా అడగవచ్చా? ప్రశ్నల కేమైనా అవకాశం వుందా?

షిలోవు:- అవే!

కాటరీనా:- మా ప్రశ్నలకి సమాధానా లివ్వండి.

గ్రిన్కిన్:- ప్రశ్నలు వేసితీరాలి.

ఓల్గా:- మాకు బాగా తెలియలేదు...

డైడోవు:- [రాయస్కీతో రహస్యంగా సంప్రదించి] మీరు ప్రశ్నలు అడగవచ్చును. కాని, అల్లరి చేయబోకండి. ఇది

సభ కాని సంత కాదు.

కోటికిన్:- [లేస్తాడు] నేను అడగవచ్చునా?

డైకోవు:- కానీ.

అనేకమూలలనుంచి అభ్యంతర పెడుతో కేకలు.

రోమనోవు:- వాడికి ప్రశ్నించే అధికారం లేదు. వాడికి వోటు కూడా తీసేసేరు. వాడికి వోటు లేదు.

జోటోవా:- వాడిని మాటలాడనియ వద్దు. మాటలాడడానికి వీలు లేదు.

మిస్టర్ అఫనాసీవు:- వాడు మాటాడకూడదు.

కోటికిన్:- మీ యిష్టం. సభ్యులకి తెలిసేటందు కొక్క ప్రశ్న వేయ దలచుకున్నాను.

కాటరీనా:- ఆతడిని ఎందుకు అభ్యంతర పెడతారు! వోటంటే పీకేసేరు గాని, నాలిక పీకేయలేదు కదా! అడగనీయండి.

గ్రన్కిన్:- ప్రశ్నలు ప్రజలకే ఉపకరిస్తాయి. విషయం బాగా తెలుస్తుంది.

షిలోవు:- షారాగ్ర్యష్! మాకు వాక్స్వాతంత్ర్యం కావాలి.

కేకలు:- ఆతడిని మాటలాడనీయండి. అతని ప్రశ్న లేవో అడగనియ్యండి.

రాయస్కీ, డైకోవులు సంప్రదిస్తారు.

డైకోవు:- నీ ప్రశ్న లేవో అడగవయ్యా!

కోటికిన్:- [టోపీ తీసి చేత పట్టుకొని, ఒక కాగితం చదువును.]

మన కామ్రేడ్ ప్రతినిధి ఏవో స్వార్థత్యాగాల్ని గురించి ముచ్చటించేడు. దానికి ఏవిధంగా అర్థం చెప్పుకోవాలి? ప్రభుత్వం ఇప్పుడు మనల్ని ధాన్యం అమ్మమంటూందా? లేక విరాళం మాదిరిగా— దేవాలయం కట్టించేటందుకు దానం చేసినట్లు—'ఇచ్చివేయమంటూందా? [నవ్వులు.]

రాయస్కీ:- ధాన్యం కో-ఆపరేటివులకీ, ప్రభుత్వానికీ, అమ్మమని కోరుతున్నాము.

కోటికిన్:- కాని, ఏదో త్యాగాన్ని గురించి చెప్పేరే! ప్రభుత్వం నియమించిన రేటుకి ధాన్యం అమ్మడం త్యాగం చేయడమే నన్న మాట. అంటే మా ధాన్యం ఊరకే ఇవ్వడమే నన్న మాట.

షిలోవు:- కాని, మేము ధాన్యం ఎక్కడినుంచి తెచ్చేది?

గ్రిన్‌కిన్:- [కోపంతో] గోధుమల ధర ఎనిమిది రూబుళ్ళా!

కాటరీనా:- మా దగ్గర ఏమయినా వుంటేనా త్యాగం చేయడానికి! ఈ వేళో రేపో మేమూ భిక్షకి బయలుదేర వలసిన వాళ్లమే! ఒకరి వద్ద కొకరం భిక్షాటనానికి బయలుదేరవలసిందే!

రాయస్కీ:- మన దేశంలో పరిశ్రమలు అభివృద్ధి చేయడంకోసం మనం చేయవలసిన త్యాగాల్ని గురించి మాటలాడేను. అంతే గాని మరొకటి కాదు. పరిశ్రమలు వృద్ధి పొందుతే అందరికీ, ఇక్కడ నున్న మన కందరికీ, చాలా ఉపకారం వుందని మీ రందరూ ఎరుగుదురు

గ్రిన్‌కిన్:- పరిశ్రమలు అభివృద్ధి పొందడానికి ఏం చేయాలి? కడుపునిండా తినా? తినకుండానా?

కాటరీనా:- [దొంగ కన్నీటితో] నాకు ఆకలి దహించుకుపోతూంది, మూడు రోజులనుంచి తిండి మొహం చూడలేదు.

కోటికిన్:- ఇదంతా చూడగా పారిశ్రామికాభివృద్ధికి చాలా ధనం అవసరం అని తోస్తూంది. అందుకేనా మా రైతులనుంచి ఎక్కువ ధాన్యం వసూలుచేయడం? అంతేనా?

రాయస్కీ:- అంతే!

కోటికిన్:- మీకు కోపం రాకుండా వుంటుందంటే నా దొక చిన్న ప్రశ్న. రైతుల్నే మీ రెందుకు ఇబ్బంది పెడతారు? కూలీలకీ, ప్రభుత్వోద్యోగులకీ, జీతా లెందుకు తగ్గించరు? రైతులు దౌర్భాగ్యస్థితిలో పడి వుంటూంటే, ఫ్యాక్టరీకూలీలకి ఆ భవంతులు, క్లబ్బులు, సినీమాలు. ఎందుకు?

పెద్ద అలజడి. అందరూ ఉద్రిక్తులౌతారు.

ఓల్గా:- నువ్వింకా పన్నుల మాట మరచిపోయేవు. పన్ను రైతు మీదనే వేసేరు. అది సకాలంలో ఇవ్వకపోయేడా వాడిని ఉరి తీస్తారు.

కాటరీనా:- అవన్నీ ఆలోచించి వాళ్ళు తమ బుర్రలు పాడు చేసుకోరు. వాళ్ళ ధాన్యం వాళ్ళ కీయండి, అంతే.

రాయస్కీ:- కామ్రేడ్స్!

గ్రిన్‌కి :- ఒకప్పుడు యంత్రాలమీద తయారుచేసిన వస్తువులు

కనబడేవి. ఈ మధ్య అవేమీ కనబడడం లేదు. ఏం జరిగిందే మిటి! ఫ్యాక్టరీలు మూసేసేరా? లేకపోతే ఆ కూలీలంతా చచ్చేరా! కొంచెం చెప్పుదూ, బాబూ!

రాయసీ:- కారణం...

ఓల్గా:- [మధ్యలో] మా కాళ్ళకి జోళ్ళయినా లేక నేము నానాబాధలూ పడుతూంటే ఉన్న చర్మం అంతా మీరు సంచులకి ఎందుకు ఖర్చుచేసేరు?

డైనోవు:- (గట్టిగా) గోల చేయకండి. వేసే ప్రశ్నలు ఒక వరుసగా వేయండి. మాకు మాట్లాడడానికి అవకాశమేనా ఈయకుంటే ఏలాగ?

కోటికిన్:- ఇదివరకు చాలా మాట్లు వినడంఅయింది.

డైనోవు:- ఇంక ప్రశ్నలు వేయడానికి వీలులేదు. వేయాలనుకున్నవాం లెవరేనా వుంటే ఈలాగ వచ్చి అడగండి. (వేదిక చూపుతాడు.)

గ్రిన్కిన్:- నేను ఇక్కడినుంచే మాటలాడుతాను. నా కంఠం పెద్దదే. అందరికీ వినిపిస్తుంది. పౌరులారా! మనం ఇదివరకే ఒక రైలుబండెడు ధాన్యం సంపించేము. మన పన్నులు ఇచ్చివేసేము. మనకున్న ప్రతి ఏగాణీ సంతోషంతో ఇచ్చేసేము. కాని, మనకు ఈ వేళకి తిండికిలేదు. నిజమే నా?

కేతలు:- నిజం! ... మన దగ్గర ఇంక ధాన్యం లేదు! ...... ఇచ్చింది చాలు. ... మనవంతు మనం ఇచ్చేసేం!

కాటరీనా:- ఏమర్గోయ్! నా కాకలి వేస్తూంది.

గ్రిష్కిన్:- మన మాటలు లెఖ్ఖచేయ దలచుకోనక పోతే బల వంతంగానే తీసుకోనీయండి. అంతేనా!

కేకలూ, చప్పట్లూ.

రోమనోవు:- ఏమిటీది? మాట్లాడరేం? [వేదిక దగ్గరకి పరుగెత్తి ఎగిరి దానిమీద నిల్చుంటాడు. ఎడమచెయ్యి లేకపోయినా ఆతడీపని సులువుగానే చేయగలిగేడు. చాలా ఉద్రేకంతో వున్నాడు. కోపంతో మొగం జేవురించింది] మన వారంతా నోరు విప్పి మాటలాడరేం? కోటికిన్! నీచుడా! కులక్! మా చెవులలో సైసం పెట్టి, నాలికకి తేనె పూస్తావేం? ప్రభుత్వం ధాన్యం అమ్మమని ఎవరి నడుగుతూంది? మూడుగంజులు మాత్రమే యున్న మమ్మల్నా? ధాన్యం పొయ్యడానికి చోటు చాలక కొత్తగాదులు కడుతూ, బస్తాలకి బస్తాలే పాతరలు వేస్తూన్న మిమ్మల్నా?

కాటరీనా:- ఎన్ని అబద్ధాలు!

రోమనోవు:- గుడ్డి గొర్రెల మాదిరిగా మీరంతా వాడన్నమాటే పట్టుకొని పాకులాడుతారేం? ఇవాన్ జిరాసిమోవిచ్! నోరు మూసుకుని కూర్చున్నావేం, నీవు కూర్చున్న చోటినుంచి కదలకుండా కూర్చున్నావు. కాని, నాకు నీ నక్కజిత్తులు తెలుసును.

సైడోవు:- [దూరానికి చూసి] ఒక్క నిమిషం ఆగండి. పట్టుపగ

టిపూటు బండెడు గోధుమలు తోలుకుపోతూన్నాడు, వాడె వడో గాని. [జనం అంతా తిరిగి చూస్తారు.] యువజనసంఘం పోయి తీసుకురావాలి. వేగం! [చాలమంది యువకకమ్యూనిస్టులు వేగంగా పరుగెడతారు. జనం అంతా శ్రద్ధగా పరిశీలిస్తూంటారు.]

షిలోవు:- పోయి పట్టుకున్నారు.

ఓక్షా:- వాడిని లాక్కొని వస్తున్నారు. అరరే! మరెవరో కాదు! మన క్వాసోవుగారి మైకేలే!

అందరూ కోపంతో వుంటారు. క్వాసోవు! మైకేల్! అని కేకలు. కొంతమంది జనం బండికేసి పరుగెడతారు.

గోమనోవు:- చూసేరూ! అదిగో బజారుకి తోలుకుపోతున్నాడు. పెద్దబండీతో బండెడుగోధుమలు తోలుకుపోతున్నాడు! నాలుగు బళ్ళ బరువు. విషపుచ్ఛం!

కేకలు:- మంచి సమయం చూసేడు! ... వెధవ... ఏమి ఆట ఆడేసేడు. ... ఎంత ధాన్యం! ... మిస్కాకి మతిపోయింది. ... గోధుమలని తోస్తుంది! ...

చాలమంది యువతీ యువకులు మైకేల్‌ని లోనికీడ్చుకొని వస్తారు. బండికోసం పోయిన జనంకూడా వెనక్కాలనే వస్తారు. మైకేల్‌ని వేదిక దగ్గరకి తీసు

కొంస్తారు. జనం కోపంతో ఆతని చుట్టుకుంటారు.

డైజోవు:- మైకేలూ! ప్రభుత్వంకి ధాన్యం అవసరంగావున్న సమ
యంలో నూరు పూడ్ల ధాన్యంతో లుకుపోతున్నా వెక్క
డికి?

మైకేల్:- నేను ప్రభుత్వానికి అపకారం చెయ్య దలపలేదు.

రోమనోవు:- బజారుకే తోలుకుపోతూండి వుంటాడు.

మైకేల్:- కాదు. ఇక్కడికే.

జనం ఆసక్తితో మూగుతారు. "నీ ఉద్దేశం ఏమి
టి"- "ఇక్కడికా"- "ధాన్యం ఇక్కడి కెందుకు?"-
అని కేకలు.

రోమనోవు:- వేళాకోళం కాదు. మేమూ ఎరుగుదుం!

కోటికిన్:- [కోపంతో] ఏమిటి నాయనా నీ అధికారం?

రోమనోవు:- సమకి ప్రత్యేకంగా మనవి చేస్తా.

డైజోవు:- ధాన్యం ఎక్కడికి తీసుకుపోతున్నావు?

మైకేల్:- సోవియటు ప్రభుత్వం చెప్పినమాదిరిగా 'బీదలకి సహా
యం చేయడంకోసం- పరిజలకి పంచిపెట్టడంకోసం- ఈ
ధాన్యం తీసుకొచ్చేను. పౌరులారా! బీదరైతుల బాధలు
చూడలేకపోయేను. నేనూ చెమటోడ్చి భూమిదున్నేవాడినే
గనక ఆ బాధలు నాకు తెలుసును. ఈ ధాన్యం మీకోసమే
తెచ్చేను. దేవుడి దయవుంటే చాలు. ఇది మీరు తీసుకోండి.

మూడు వేపులకి తిరిగి తలవొంచి నమస్కరించుతాడు. ఒక్క-క్షణం నిశ్శబ్దం. అందరూ ఏదో అదృశ్యశక్తి ఆవహించినట్లు బండీకేసి చూస్తూంటారు.

కౌటకీనా:- ఉచితంగా ధాన్యం! ఉచితం! ఉచితం! (బండీకేసి పరుగిడుతుంది.)

ఆశతో ప్రజలంతా ఉచితంగా దొరికిన ధాన్యం కోసం ఎగబడతారు. కొద్దిమంది పార్టీసభ్యులూ, యువకకమ్యూనిస్టులూ, మాత్రం వేదికదగ్గర మిగులుతారు. వారు నిరాశతో వెర్రిమొహం వేసుకొని చూస్తూంటారు. మైకేల్ విషపునవ్వులు నవ్వుతూ, ప్రజలవేపు చూస్తూ నిల్చొంటాడు. అతని తండ్రి క్వాసోవు కదలకుండా, తన కేమీ సంబాధం లేనివాడిరిగా ఆ దుంగమీద అలాగే కూర్చుంటాడు.

[తెర.]

అయిదో రంగం.

క్వాసోవ్ ఇల్లు. రాయస్కీ ఒక్కడూ కూర్చుని వ్రాసుకుంటూ వుంటాడు. తలుపు తట్టిన చప్పుడు. పాషా వెళ్ళి తలుపు తీస్తుంది. క్వాసోవ్ వస్తాడు.

రాయస్కీ:- ఓం. మీరా!

క్వాసోవు:- ఔను. నేనే క్షేమమా?

రాయస్కీ:- మీ దయ!

క్వాసోవు:- రాత్రి నిద్ర పట్టిందా! మా హంసతూలి కాతల్పాలు మెత్తగానే వున్నాయా!

రాయస్కీ:- మీ తూలికాతల్పాలు దొంగలు తోలా! తెల్లవార్లు పక్కలొత్తి దొర్లుతూనే వున్నాను.

క్వాసోవు:- మా కలవాటు. నిద్ర బాగానే పడుతుంది.

రాయస్కీ:- అవి దళంగానే వున్నాయి.

క్వాసోవు:- అదే ఆరోగ్యం.

రాయస్కీ:- తెల్లవారేక ఓల్గాని చూసేరా?

క్వాసోవు:- చూడడం పడలేదు. (తటపటాయిస్తాడు) మీరీ పూట ఎవరినేనా కలుసుకోవాలా?

రాయస్కీ:- నన్ను కలుసుకోనడానికి వాళ్ళే వస్తున్నారు. ఫెయిగ్మనూ వాళ్ళూ.

క్వాసోవు:- ఆలాగా!... ఆలాగా!... నిన్న మా వూరివాళ్ళు చాలా అసందర్భంగా ప్రవర్తించేరు...

రాయస్కీ:- ఆలాగ దారిలోకి రా. ఈ నటన వదిలిపెట్టు. ఆ జరిగిన పనికి నీకు సంతోషంగానే వుంది. అది నీ మొహంలోనే కనబడుతూంది.

క్వాసోవు:- నాకా!... నేనేం చేసేను?

రాయస్కీ:- నిన్న గోధుమల విషయంలో జరిగిన నాటకానికంతకీ బాధ్యు లెవరు? నీ కొడుకే కాదూ?

క్వాసోవు:- ఆలా గనడం అన్యాయం! దేవుడి నెత్తిమీద చేయి పెట్టి ప్రమాణం చేసి చెప్తున్నా. మీ అభిప్రాయం సరి కాదు. ఇప్పుడు వాడి యింటి నుంచే వస్తున్నా. తండ్రి పెట్టగల చీవాట్లు తగిలించేను. మీటింగు జరుగుతూండగా ధాన్యం ఎందుకు తేవలసి వచ్చిందని అడిగాఁ. ఎందుక గందరగోళం చేసేవు? —అని అడిగేను. కాని, వాడు నా మాట వింటాడూ! ఈ రోజులలో పిల్లల సంగతి మీకు చెప్పాలా? ఏమయినా అన్నా నా తన వాటా పంచుకు పోతానంటాడు ...ఊఁ. తండ్రి ఏమయిపోతే నేం!

రాయస్కీ:- మీటింగుకి అభ్యంతరం కలగచేసినందుకు ఆతడిని అరస్టు చేయిస్తానా.

క్వాసోవు:- అది కూడా న్యాయం కాదు. ఎటువంటి దురభిప్రాయమూ మనసులో వుంచుకొని చేసినపని కాదు. అయితేనేం? మీ యిష్టం ఏలా వుంటే ఆలాగే చేయొచ్చు. శాసనం చేసేటప్పుడు ఈలాగంటి పరిస్థితులు కలుగుతాయని వూహించియుండక పోవచ్చు. ఆవిషయం నాకన్న మీకు బాగా తెలుస్తుంది. దానితో ఎక్కువ పరిచయం ఉన్నవారు మీరు. [ఊరుకుంటాడు.] పాషా! నీ గదిలోకి వెళ్ళమ్మా!

పాషా:- నే నింతవరకు నీ యూహాలు వేనికీ అడ్డం రాలేదు. ఇకముందు అదికూడా తటస్థపడొచ్చు. జాగ్రత!

క్వాసోవు:- వెళ్ళమని చెప్తున్నా. వెళ్ళు. నెమ్మదిగా చెప్తాం.

పాషా గభీమని లేస్తుంది.

రాయస్కీ:- ఎందు కామెని తరుముతావ్? ఆమెని ఇంటిలో మూసేసి అధికారం చలాయిస్తున్నా రేమిటి? పాషా చిన్న పిల్ల కాదు సుమా!

క్వాసోవు:- నే నామె తండ్రిని.

రాయస్కీ:- అయితే ఆమెని పీడించే టందుకు మీకేమయినా అధికారం వుందనుకుంటున్నారా? ఈ పాటికి అవన్నీ కట్టిపెట్టండి. మేము పోయేటప్పుడు ఆమెని కూడా మాతో తీసుకుపోవా లనుకుంటున్నాం.

క్వాసోవు:- ఆమె యిష్టపడితే నా అభ్యంతరం లేదు.

రాయస్కీ:- మాతో వస్తావా, పాషా!

పాషా:- తెలివి తక్కువ ప్రశ్న! [వెడుతుంది.]

రాయస్కీ:- [ఆమెని పిలిచి] పాషా! వేళాకోళం కాదు. నిజం! [బల్ల దగ్గర నిశ్శబ్దంగా కూర్చుంటాడు.]

క్వాసోవు:- కామ్రేడ్! అయితే ఇప్పుడేమి చేయాలనుకుంటున్నారు, మరి?

రాయస్కీ:- ధాన్యం వసూలు చేసి తీరుతాను. నేనే స్వయంగా ఇంటింటికీ వెడతాను. కొందరిని సాయం తీసుకుని కూరపెరళ్ళన్నీ తవ్వించేస్తా. నే నేమీ వెనక తగ్గేరకం కాను.

క్వాసోవు:- నేనూ అదే భయపడుతున్నా. కామ్రేడ్! ఈ ముసిలివాడి మాట వినండి. ఇక్కడి వారందరినీ నే నెరుగుదును. ప్రతివాడిదగ్గరా ఏముందో నాకు బాగా తెలుసును. వాళ్ళ గాదెలలో ఏమి వుందో, వారి మొలని ఏం వుందో పిడతలలో, భూమిలో, ఏమేమి దాచుకున్నారో, అదంతా నాకు తెలుసు. ఇక్కడ ఏడు వేలపూడుల ధాన్యం దొరకదు. నే నా రైతులతో ఈ వేళ మాటలాడివచ్చేను. మేమెంత ఈయగలమో అంతా ఇచ్చివేస్తాము. దానికి మీటింగులతో పని లేదు. రెండువేలపూడులు మాత్రం మే మీయగలం! అంతకంటె ఎక్కువ ఇయ్యడం మా తరంకాదు.

రాయస్కీ:- ఏమిటీ! రెండువేలా! గ్రామం అంతా సోదాచేసి గాలించి వేయనిదే వొదలను.

క్వాసోవు:- [విగ్రహాల యెదుట వొంగి నమస్కరించి] ప్రభూ!

నీవకుని ఆత్మని రక్షించు! పావేల్! దయచూడు!

రాయస్కీ:- అతి గడుసుదనం చూపొద్దు. ఏమి టివంతా!

క్వాసోవు:- ఈనోటితో ఆ మాటలు చెప్పలేను.

రాయస్కీ:- ఇదిగో! గడుసుదనం చూపవద్దు.

క్వాసోవు:- కా(మ్రేడ్! బ్రితకనీయరు. ఇంటింటికీ వెళ్ళే రంటే మిమ్మల్ని చంపేస్తారు. నాకు తెలుసును.

రాయసీ్కీ:- నన్ను బెదరించి తరమలేరు.

క్వాసోవు:- బెదరి పులతో ఆగేరకం కాదు, వాళ్ళు. ఏ మూల నుంచో కాల్చి చంపుతారు. రాత్రో-పగలో ఇది జరిగితీరు తుంది. మా వూరివాళ్ళు మహా తెంపరులు. పొగరుబోతులు. వట్టి పుండాకోరులు. చూసేరు కాదు?

కిటికీ వద్ద చిన్న చప్పుడు.

రాయస్కీ:- [అదిరిపడి] ఏమిటది?

క్వాసోవు:- [కిటికీ దగ్గరకి వెళ్ళి చూస్తాడు.] వాడు- ఆ రోమనోవుగాడు వచ్చేడు. తుంటరి! మన పాంతాలకి పేరుపడ్డ పొగరుబోతు. ఇదివరకో చెయ్యి పోయింది. అయితేనేం! లక్ష్యమా! శాంతంగా ఒకచోట కూర్చుంటాడూ! తాచుపాము బుసలు కొట్టినట్లుధూమ్—ధామ్ అంటూనేవుంటాడు. తీసుకురానా వాడిని!

రాయస్కీ:- లోపలకి రానీండి! నిన్ననే మిమ్మల్ని గురించి ఏదో మాటలాడదలచుకున్నట్లు తోచింది.

క్వాసోవు:- స్వంతనోటికి ఖర్చేముంది?

క్వాసోవు తలుపుతీసి రోమనోవుని వెంటబెట్టుకు వస్తాడు.

రోమనోవు:- నమస్కారం! కామ్రేడ్! ఈ ఛండాలుడుండగా నేను మాటలాడను. పొమ్మను వీడిని.

రాయస్కీ:- ఇటు రా. ఆయనగారిని ఆలాగ తిట్టకు. మనం వున్నది ఆయన యింట్లోనే.

రోమనోవు:- వీడికి ఇల్లేమిటి? మనమే దీనిని కట్టియిచ్చేము. ఈ వేళ కిందులో వున్నాడు. త్వరలోనే అందరం కలిసి ఉద్వాసన చెబుతాం!

క్వాసోవు:- నా కెందుకు. మీరు మాటాడుకోండి, నే పోతా. కాని, కోల్యా! ఎప్పుడూ ఈలాగే వున్నావు. జాగ్రత! నీ రోజులు దగ్గర పడినాయి.

రోమనోవు:- ఏం చేయగలవోయ్! నూతులో తోసేద్దా మను కుంటున్నావా? నే నింకా మరువలేదులే.

క్వాసోవు:- నీ వంటి అబద్దాలకోరుల్ని శిక్షించడానికి శాసనాలున్నాయి.

రోమనోవు:- సోవియటు శాసనాలని తమరు నా మీదికి తిప్పుతారు కాబోలు నేం?

క్వాసోవు:- దీనికి ప్రతిఫలం అనుభవించకపోవు. కానీ, తిట్టు.

వెళ్ళిపోతాడు.

రాయస్కీ:- నయ్యి అన్నా వేమిటి?

రోమనోవ్:- 'వైట్సు' ఈ గ్రామానికి వచ్చినప్పుడు వీడే మన వారిని పన్నెండుగుర్ని పట్టియిచ్చేడు. వారిని చిత్రవధ చేయడంలో వీడూ సహాయపడ్డాడు. వీడే ఆ ముక్కలన్నీ ఒక నూతిలో పారేసేడు. ఇందులో ఎంతమాత్రం అసత్యం లేదని నాకు బాగా తెలుసును. కాని, సాక్ష్యం ఏదీ? దొరికినూడా బొమ్మిడాయిలా జారిపోయేడు. వాడే ఆ పని చేసివుండక పోతే ఈ నా రెండో చెయ్యి కదపా.

రాయస్కీ:- [నమ్మలేక] ఈ ముసిలాడు?

రోమనోవ్:- వీడే. ఈ అల్లరికంతా మూలకందం వీడే. నే చెప్పే దానిలో ఏ మాత్రం అసత్యం వున్నా చచ్చినంత వొట్టు.

రాయస్కీ:- ఏమో. నీ యిల్లెక్కడ?

రోమనోవ్:- [వెటకారంగా] గ్రామంలో ప్రవేశించ బోయే ముందు మా రాజప్రాసాదం కనపడలేదు! అది నేలలో తవ్వి కట్టేమేమో ఈ సాధారణపు కంటికి కనపడదు.

రాయస్కీ:- ఆ మట్టిగుడిసె నీ దన్నమాట.

రోమనోవ్:- నాదే. మా నాళాలలో ఇంకా రాజరక్తం ప్రవహిస్తూంది. నా పేరు కోల్కా రోమనోవ్. తెలిసిందా!

రాయస్కీ:- నీ పని? పార్టీ సభ్యుడివా?

రోమనోవ్:- నా కున్న దీ ఒక్క చెయ్యే.

రాయస్కీ:- నేను వేళాకోళం చేయడంలేదు.

రోమనోవ్:- అయితే నన్ను తోసేసేయ్.

రాయస్కీ:- ఎందుకు?

రోమనోవ్:- నా నాడులలో మించి తీవ్రమైన రక్తం ప్రవహిస్తూంది. కారణం ఏమంటే ఇంకా చిన్న వాడిని గదా?... అదో విషయం కాదులే. వాళ్లు నన్ను తిరిగి తీసుకుంటారు.

రాయస్కీ:- నువ్వు తప్పకుండా పార్టీలో మళ్ళీ చేరు.

రోమనోవ్:- తప్పకుండా చేరతాను. నాతో పాటు నా రోమనోవ్ పటాలాన్ని అంతనీ కూడా పార్టీ లోకి తీసుకు వస్తాను. నేనో పటాలాన్ని తయారు చేసేను. మాకు యూనిఫారాలు, అధికార చిహ్నాలు, అన్నీ వున్నాయి. కాని, కాళ్ళకి బూట్లే లేవు. పెరేడులో వట్టి కాళ్ళ మీదనే నిల్చోవలసి వస్తూంది.

రాయస్కీ:- ఎన్నాళ్ళలో ఈ పని చేయ గలవు?

రోమనోవ్:- మా సభ్యత్వపు చీట్లు సిద్ధం చెయ్యగానే.

రాయస్కీ:- నువ్వు తాగిలేవూ?

రోమనోవ్:- నే నెప్పుడూ తాగే వుంటాను. కొంచెం అలా వెళ్ళి మా బిలం లోకి పాకి పోయి, గోడల కేసి ఒక సారి చూడు. నిజంగా ఏడుస్తూంటాయి. ఉప్పనికన్నీళ్లు కారుస్తూంటాయి. వాటిని చూస్తే నీకు కూడా ఏడుపువస్తుంది. కాని మా పటాలం లోకి వచ్చి చూడు! అంతా ఆనందం! గోడలు ఎత్తుగా ఉంటాయి. నేల పొడిగా ఉంటుంది.

రాయస్కీ:- నీకు మరొక చోటు ఎందుకు ఈయరు? అంటి వాడివి కదా?

గోమనోవు:- ఎక్కడ ఉందని ఇస్తారు. సమిష్టి గృహం కట్టుకున్నప్పుడు నాకో భాగం,- మూడు గదులు, ఒక అలంకార గృహం ఇస్తారు.

రాయస్కీ:- మీరు సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఏర్పరచుకోరు?

గోమనోవు:- చేయవచ్చు. కాని దానంతట అది ఏర్పడుతుందా?

రాయస్కీ:- ఎప్పుడుచేయొచ్చు?

గోమనోవు:- తగిన సన్నాహం అంతా చేస్తూన్నాము. త్వరలో కోటని ముట్టడిస్తాము. కామ్రేడ్! నా జీవితం ఎంత ఆనందకరంగా ఉందనుకున్నావు? ఏదో పెద్ద సుడిగాలిలో, ఆనందదాయకమైన సుడి గాలిలో కొట్టుకు పోతూన్నానా? అనిపిస్తూంది. నా మట్టి గుడిసె మట్టి గుడిసె అనిపించడం లేదు. అదొక పెద్ద ఓడ. నేనొక ప్రయాణీకుణ్ణి. తెరచాపలు రెపరెప లాడుతూన్నాయి. కొయ్య వంగుతూంది. నా పట్టుగు నేను క్రిందా మీదా పడుతూన్నాను. అయినా సరే. దాన్ని ముందుకే నడిపిస్తా. సముద్రాలన్నీ పొంగి, చెలియలి కట్టలు దాటి, గుడిసెలన్నీ నీట మునిగి పోతాయి. వాటి కప్పులమీద రైతులు నిలబడి 'కోల్కా! తాడు విసిరి మాకు అందించు... పైకి లాక్కో' అని అరుస్తారు. ఒక్కొక్కళ్ళనే పైకి, పైపైకి లాక్కుంటాను. ఇంకా ముందుకి వెడతాను. గ్రామస్తులందరినీ

నాతో తీసుకు వెడతా. నవ్వుతా...ఏడుస్తా...

[కన్నీరు ప్రవహిస్తుంది.]

రాయస్కీ:— ఏడుస్తున్నావేమిటి? ఎందుకు?

రోమనోవ్:— ఆనందం అధికంఅవడం చేతనో— ఇంత వెర్రి పిచ్చనైపోయేనే అనో—ఏడుస్తున్నాను...దానికేంగాని, ధాన్యం వసూలు చేస్తావా?

రాయస్కీ:— తప్పకుండా వసూలు చేయాలి. తప్పదు. కాని, ఏడు వేలు వసూలు చెయ్యగలం అని తోచదు.

రోమనోవ్:— ఏమిటినీవుద్దేశ్యం! వసూలు చేయలేం? కావాలంటే పన్నెండు వేల పూడులు కూడా వసూలు చెయ్యగలం. తెలుసునా? మనం ప్రతీ యిల్లు సోదాచెయ్యాలి.

రాయస్కీ:— సరే, అవీ తెలుస్తుంది కదూ. ...(తలుపు దగ్గర చప్పుడు) ఒక్క క్షణం; నే తలుపుతీస్తా ... (తలుపు తీసి ఓల్గాని రానిస్తాడు.) ఓల్యంకా! ఎక్కడికి పోయేవు! నీకోసం మనస్సు ఎంత ఆరాటపడుతూందనుకున్నావ్?

ఓల్గా:— నీవు ఎంతసేపు నిద్ర పోతావో ఆ భగవంతుడికే తెలియాలి. ఊరంతా తిరిగి దూరంగా పొలాల వీాదికి కూడా షికారు పోయి వచ్చేను.

రాయస్కీ:— నన్నెందుకు లేపలేదు? నేకూడా వద్దును కాదూ?

ఓల్గా:— ఎందుచేతనో కాని ఆ మాటే తోచలేదు సుమా.

రాయస్కీ:— నీ మనస్సు కేమయినా కష్టం తోచిందా?

ఓ ల్గా:- నిన్నటి మన అపజయాన్ని చూచేటప్పటికి చాలా బాధ కలిగింది.

రాయస్కీ:- మనకింకా పూర్తిగా పరాజయం కలగలేదు. చెప్ప లేదూ— ఈ ప్రాంతాలింకా ప్రాథమిక స్థితిలోనే ఉన్నా యని.

ఓల్గా:- కాని ఒక్క క్షణికంలో విజయం సంపాదించ గలవనే అనుకున్నారు సుమా నేను.

రాయస్కీ:- వేదికమీద నున్నంతసేపూ ఓడలో కెప్టెన్ స్థానం లో నున్నట్లూ, చుట్టూ పెద్ద తుపాను రేగుతూన్నట్లూ అని పించింది. తరంగాలు బయలుదేరి, ఓడ పార్శ్వాలకు కొట్టు కొని చెదిరిపోయినాయి అనిపించింది.

ఓల్గా:- అయితే ఇప్పుడు ఏంచెయ్యాలని నీ ఊహ?

[కిటికీ దగ్గర పిలుపు. ప్రైడోవు, లోట్కేవు, జొటో వాలు లోనికి వస్తారు. మామూలు స్వాగతాలు నడుస్తాయి.]

లోట్కేవు:- మనం పరిస్థితులన్నీ ఆలోచిద్దాం.

రాయస్కీ:- ఇక్కడి స్థితిగతులు మీకు తెలిసినంతగా నాకు తెలియవు. ఏమిటి మీ సలహా?

ఓల్గా:- కూర్చుని మాట్లాడుకుందాం.

[అందరూ కూర్చుంటారు.]

డైకోవు:—(రోమనోవుతో) మళ్ళీ వద్దువు గానిలే వెళ్ళు.

లోబ్రేవు:— వాడుంటే నీకువచ్చే బాధేమిటి? వుండనీ.

రోమనోవు:— పోతా. ఒంటిచేతివాణ్ణి...

జొటోవా:— కోల్యా! ఉండవోయ్ (డైకోవుతో) పాత స్నేహి
తుల్ని పొమ్మంటావేం? కామ్రేడ్ రాయస్కీ! నువ్వు చెప్పు!

రాయస్కీ:— వెళ్ళకోయ్! కూర్చో. కామ్రేడ్స్! వేగంగా
చెప్పండి.

డైకోవు:— పరిస్థితులేలా వున్నాయో ఇప్పుడుచెప్పనే చెప్పేను.
ప్రజలంతా తిరుగుబాటు చేస్తూన్నారు. వాళ్ళ దగ్గర ధాన్యం
ఉన్నట్టుగా తోచదు. మనం వెనక తగ్గక తప్పదు. ఊఁ.

లోబ్రేవు:— ధాన్యం వసూలుచేయకుండా పోవడమే?

డైకోవు:— (వేళాకోళంగా) ఎందుకు కూడదు! పోగు చేద్దాము.
ఇంటింటికీ పోయి కొద్దో గొప్పో వసూలు చేద్దాము.

లోబ్రేవు:— అయితే గ్రామంలో ధాన్యం కొద్దోగొప్పో మాత్రమే
ఉన్నాయని నీఊహ.

డైకోవు:— మన కామ్రేడ్ ప్రతినిధి నిర్ణయించిన ప్రకారం —
ఆతని ఆదేశం ప్రకారం పోగు చేస్తాను.

రోమనోవు:— కామ్రేడ్ అధ్యక్షా! నేనొక ప్రశ్న అడగ
వచ్చునా?

డైకోవు:— కానీ.

రోమనోవు:— ఆవ తిన్న పసరంలా అలా గిల గిల లాడతావేమి?

నా మాటలకి సరిగా సమాధానం చెప్పు — కులక్ల దగ్గ ధాన్యం లేదు!

డైకోవు:- నువ్వు ఇలాగ తిరస్కారంగా మాట్లాడ కూడదని ఇది వరకు ఒకమారు బుద్ధి చెప్పేము.

రోమనోవు:- చచ్చే వరకూ నేను ఈ ధోరణి వదలను. చచ్చిపో యిన తరువాత కూడా ఈ ధోరణి వదలను. గోరీలో నుంచి కూడా తల పైకి యెత్తి గ్రామం అంతా మారుమ్రోగేటట్లు అరుస్తాను. (గట్టిగా) కులకుల దగ్గిర ధాన్యం వుంది.

రాయస్కీ:- (చీకాకుపడి) అబ్బ! అరవకోయి! మాకేం చెముడు లేదు. ఇంకా నువ్వుఅప్పుడే చచ్చి గోరీలోకి చేరుకోనూలేదు.

డైకోవు:- నీలాగ అరవడం వలన మన సోవియటు ప్రభుత్వానికి నష్టమే కాని లాభం లేదు. నిన్నటి మీటింగులో గోలచేసింది ఎవరు? కులకులేనా? చెప్పు. కామ్రేడ్ రోమనోవు! రైతుల ఆర్థిక పరిస్థితులు తెలుసుకొని మరీ మాట్లాడుతూండాలి. నీ కెప్పుడేనా నీస్వంతంకి భూమి-ఫర్మ వుందా- ఏమన్నానా? ఇంకా నువ్వు తెలుసుకోవలసిన విషయాలు చాలావున్నాయి.

రోమనోవు:- నువ్వు చెప్పే వ్యవసాయమే నా కుడిచేతిని పుచ్చు గుంది. తిట్టు! డైకోవూ! తిట్టు! కామ్రేడ్ అధ్యక్షా! కులకు లంతా నన్ను కొరగాని వాడని అంటూనే వున్నారు.

లోక్టేవు:- ఇద్దరూ చాలించండి మరి. కామ్రేడ్ రాయస్కీ! మనం ఒక నిర్ణయానికి రావాలి. అక్కడ ధాన్యంవుంది. అందు

లో సందేహం లేదు. ఇప్పుడు మనం ఏమిటి చెయ్యాలం?

జొటోవా:- కులకుల్ని అరెస్టు చెయ్యండి; కావలసిన ధాన్యం అంతా ఒక్క రోజులో వస్తుంది.

రాయస్కీ:- అరెస్టు చెయ్యడమా?- కారణం లేకుండానే?

జొటోవా:- ధాన్యం ఇచ్చేదాకా జైలులో పెట్టు.

పైసోవు:- వాళ్ళని యిప్పుడు అరెస్టు చేసేమంటే సాయంకాలం అయ్యేటప్పటికి వూరంతా తిరగబడుతుంది.

రాయస్కీ:- తిరుగుబాటా?

పైసోవు:- ఏం గగనమా ఏమిటి! చుట్టుపక్కల గ్రామాలన్నీ గగ్గోలు పెట్టేయ్యవూ? దానికంతకీ బాధ్యుడెవడు అవుతాడు! కమ్యూనిస్టు యువజన సంఘ కార్యదర్శిని జొటోవా యా! క్షమించండి. ఆవిడమాటే తలపెట్టరు ఎవరూ. ఇక ఈ కోమిస్ట్రి కోల్లా రోమనోవు బాధ్యత వహిస్తాడా! ఉహుం. పైసోవు మీదనే ఆ పూచీ వుంచుతారు. కామేడ్ రాయస్కీ పైన పడుతుంది ఆ బాధ్యత...

రాయస్కీ:- (లేచి గదిచుట్టూ తిరుగుతూ) నిజం...

లాన్ట్సేవు:- అయితే ఏమిటి చేయడం ఇప్పుడు?

రాయస్కీ:- కామేడ్స్! పరిస్థితులు మనం అనుకున్న కంటెను తీవ్రంగా వున్నాయి. నిన్నను చూడనే చూసేరు. ఒకే మాట మీద నిలబడి, ఏకీభావంతో రైతులంతా మనల్ని ఎదుర్కొన్నారు.

జొటోవా:- వాళ్ళంతా కులకులే... నేను ఈ గ్రామం గ్రామం అంతా కులకులే అని చెప్పలేను!

రాయస్కీ:- ఇప్పుడు మనకి ఉన్నవల్లా రెండేమార్గాలు. ఇప్పుడు చెప్పినట్లుగా అరెస్టులు ఆరంభించి ఇళ్ళన్నీ సోదాలు చెయ్యడం ఒక పద్ధతి. మొదట నా వుద్దేశ్యం కూడా అదే. కాని, ఇప్పుడు డైకోవు ఊహయే సరియైనదని తోస్తూంది. గ్రామస్తులంతా మన మీద కత్తి దూయడమే కాదు— అనుకున్నట్లు ధాన్యం వసూలు చెయ్యలేక పోవడమే కాదు- మన కార్యాల వలన తటస్థపడే భీకర పరిస్థితుల కన్నిటికీ మనమే బాధ్యులం కావలసి వస్తుంది.

లొక్టేవు:- కొద్దిగా తయారయి వుంటే ఈ చిక్కులు లేకపోను.

రాయస్కీ:- ఇంక రెండో మార్గం వుంది! అదే సరియైనదని నా వుద్దేశ్యం. బోల్షివిక పద్ధతుల కనుకూలమైనది అదే. రెండు మూడు వేల పూడ్ల ధాన్యం వసూలు చేయడం కంటె రైతుల్ని మనపట్ల సుముఖులుగా చేసుకోవడం ప్రధానం. అందు చేత ఈలాంటి పరిస్థితుల్లో ఎక్కువలో ఎక్కువ ఎంత వసూలు చెయ్య కలమో తేల్చుకొని ఆ ప్రకారం వసూలు చెయ్యడం మంచిది. ఆ పద్ధతిలో రెండు మూడు వేల పూడ్ల కంటె అధికంగా వసూలు చెయ్య లేక పోతామేమో నని యెవ్వరూ కించపడ నక్కర లేదు.

డైకోవు:- శభాష్!

రోమనోవు:- కామ్రేడ్స్! (తలవని తలంపుగా బల్ల దగ్గిరికి పోయి ఉన్న ఒక్క చేతిని దాని మీద అనుకుంటాడు.) ఇదిగో - మైకేలోవు! ఈ చెయ్యి కూడా నరికి పారెయ్యి. ఇంక దీని ఉపయోగం ఏమీ లేదు. నువ్వు ఆ చెయ్యి ఇంక లేవనియ్యవు. నా దగ్గిర ఆయుధమూ వుంది. దానితో నరక కలసిన జనమూ వున్నారు. కాని, అది ఉపయోగించ నీయవు కదా!

రోమనోవు మాట లాడుతూండగా మైకేలోవు లోపలికి వస్తాడు. ఒక పాత మిలిటరీ కోటు తొడిగి, మాసిపోయిన టోపీ వొకటి పెట్టుగున్నాడు. అతనిముఖం గంభీరంగా వుంటుంది. అతని హఠాదాగమనానికి రాయిస్కీ చాల గాభరా పడ్డాడు.

మైకేలోవు:- ఏమిటి చేస్తూన్నా రిక్కడ? ఏమయినా కసాయి దుకాణం తెరవ లేదు కద! ఏమిటి నరికివేయడం అంటున్నారు? హలో! పావెల్! క్షేమమా! కామ్రేడ్ లోక్టేవా! ఇదుగో వొల్గా! (రోమనోవుతో) ఓ- మీరా! ఏలినవారు! ఎవరు ఆ తిరుగుబాటు చేస్తూన్నది! మళ్ళీ మీ ప్రజల మీద ఆక్రమణం తప్పిందా!

రోమనోవు:- మీ వెళాకోళాలకి సమాధానం చెప్పగల శక్తి లేదు, కామ్రేడ్ మైకేలోవు! ఇంక నే బ్రతికేది ల్లా రెండేళ్ళు. ఈ నా జీవితం వ్యర్థం కావలసిందేనా!

డొాటోవా:- కామ్రేడ్ మైకేలోవు! ఇక్కడ కొద్ది రోజులుండ డానికే వచ్చేవా? పార్టీ మీటింగులో మాట్లాడవు?

మైకేలోవు:- ధాన్యం వసూళ్ళు చురుకుగా కొనసాగించడం కోసం జిల్లాలన్నీ తిరుగుతూన్నా. పావెల్! ఇక్కడి పరిస్థితులు ఏ లాగ వున్నాయి?

రాయస్కీ:- ఉన్నాయి! ప్రస్తుతం కొంచెం తగ్గవలసిన పరిస్థితులు వచ్చేయి. స్థానిక పరిస్థితులు కొంచెం ఆలోచించకు తీరదు.

మైకేలోవు:- ఏమిటీ స్థానిక పరిస్థితులు? అటువంటి వేమీ ఉండ కూడదే ఇక్కడ! గ్రామంలో వలసినంత ధాన్యం వుందే.

డైకోవు:- ఒకప్పుడు వుండేది.

మైకేలోవు:- ఎవరయ్యా నువ్వు?

డైకోవు:- స్థానిక సోవియటు అధ్యక్షుణ్ణి - డైకోవు మైకేల్ పాలోవిచ్ అంటారు నన్ను.

మైకేలోవు:- ఎప్పుడో వుండేదని కాదు- ప్రస్తుతం వుండున్న విషయం తెలుసుకో.

డైకోవు:- (వెనక తగ్గుతూ) ఆహా!...

లోక్టేవు:- ప్రస్తుతం వరకు మేము ఓడిపోయేము.

మైకేలోవు:- ఏమిటీ? ఓడిపోవడం అంటే?

లోక్టేవు:- (అతనికి ఒక కాగితం ఇస్తూ) నిన్నటి మీటింగు రిపోర్టు ఇది. చదువుకో.

మైకేలోవు:- (చదివి తలవూపి గొణుగుతాడు.) ఓ! అదీ సంగతి.

(లోక్తేవుకి ఆ నివేదిక తిరిగి ఇచ్చేస్తూ, డైకోవుతో) మిస్కా-
క్యాషోవును అరెస్టు చేసేరా?

డైకోవు:— ఆజ్ఞల కోసం ఆగేను.

మైకేలోవు:- ఆగేవూ? తక్షణం వాడిని జైలులో పెట్టు. ఈ వేళ రాత్రికి మీటింగు పిలు.

డైకోవు:— మీ యిష్టం.

రాయస్కీ:- నా వుద్దేశం- ఏ విధమైన తయ్యారీ లేకుండా ఈ వేళ రాత్రి మీటింగు పిలుస్తే ఏమీ ప్రయోజనం ఉండదు.

మైకేలోవు:- ఆ చేయవలసిన ప్రయత్నాలేవో ఇదివరకే చేసివుండ వలసింది.

లోక్తేవు:- నేనూ ఇదే చెప్పేను.

మైకేలోవు:- అదే నువ్వూ చెప్పేవూ? చెప్పడమే కాదు, చేసి ఉండ వలసింది.

లోక్తేవు:- కాని కామ్రేడ్ రాయస్కీ...

మైకేలోవు:- రాయస్కీ! రాయస్కీ! రాయస్కీ ఏమిటి? నువ్వు పార్టీ కార్యదర్శివి; ఇతరులతో నీకు అభిప్రాయ భేదం కలిగినప్పుడు వాళ్ళని నువ్వు ఒప్పించగలిగి వుండాలి. అతనిది తప్పనీ నీ మార్గం సరియయినదనీ, నచ్చచెప్పాలి. నువ్వు అతడికి నచ్చచెప్ప లేక పోతే వెంటనే జిల్లా కార్యాలయానికి టెలిఫోను చేయాలి. వాళ్ళని అడుగు. వేధించుకు తిను. లేకుంటే నువ్వు వట్టి దద్దమ్మ వన్న మాట స్పష్టమే! ఇప్పుడో- సమయం దాటి

పోయింది, సరంజామా చేసుకుందుకు. కులకు బహిరంగ సభ లో మనల్ని ఓడ కూ నీసేసు. ఇంక ఏమాత్రమూ ఆలస్యము కాకుండా ఆ చేత్తో వాళ్ళ నెత్తికొట్టాలి.

రాయస్కీ:- నిన్నెదిరించేది ఒక్క కులకులే కాదు. గ్రామం లోని రైతాంగం అంతా పోరాటానికి దిగింది.

మైకేలోవు:- గ్రామంలోని రైతాంగం అంతా కలియడం అనేది వట్టి మాట. పట్టణం- పల్లె అనేవి కేవలం భూగోళంలోనూ కవిత్వంలోనూ మాత్రమే కంటు పడతాయి. సాంఘికముగా వాటికి అర్థం లేదు.

రాయస్కీ:- సిద్ధాంతం- అయితే అది మంచిదే. కాని, ధాన్యపు వ్యవహారం వచ్చేటప్పటికి, రైతాంగంఅంతా మన కెదురెత్తుగా తయారయి వూరుకుంటుంది. ఆ ప్రవాహాలన్నీ కలుస్తాయి.

మైకేలోవు:- పావేల్! అవన్నీ పొరపాటు. వేరు వేరు ప్రవాహాలు, వేరు వేరు నీటి విసురులు, వేరు వేరు తరంగాలూను. నీ పడవని నడుపుగోడంలో వుంటుంది అంతా.

జొటోవా:- ఈ వూరంతా కులకులే అంటాను.

మైకేలోవు:- ఇది నువ్వనే మాట కాదు. ఈ మాట అంటూన్నది నువ్వు ఒక్కతవేనని అనుకుంటూన్నావు అంతే.

జొటోవా:- ఏమిటీ వింత? డిమిట్రీ! అయితే ఆమాట అంటూ న్నది ఎవరంటావు?

మైకేలోవు:- కులకు లంటారు ఈ మాటలు.

జొటోవా:- 'కులకు' అన్న పేరు చెబుతేనే మండిపడి దాన్ని, వాళ్ళన్న మాటలు పట్టుగు పొరులాడుతానా!

మైకేలోవు:- అలాటివి లేకపోలేదు. కామ్రేడ్స్! మనపని మనం చేసుకుందాం. రోమనోవు! నువ్వు కొన్ని వార్తలు అందించాలోయ్. డైడోవు! ప్లేట్ పట్టీక తియ్య. సరిచూసింది సుమా. మళ్ళీ ఒక్కమాటు సరిచూడు. లోక్టేవు! మీ సభ్యులందర్నీ పిలుచుగురా. కాని, అన్నిటికంటె ముఖ్యం, మనం వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి.

మైకేలోవు, డైడోవు, లోక్టేవు, రోమనోవు, జొటోవాలు బయలుదేరుతారు.

రాయస్కీ:- (పిలిచి గట్టిగా) జాగ్రత్త సుమీ. దొమ్మి జరుగుతుందేమో.

మైకేలోవు:- (ద్వారం దగ్గిర నుంచి) దౌర్జన్యాన్ని దౌర్జన్యంతో ఎదురుకుంటాము.

రోమనోవు:- కామ్రేడ్ ఛైర్మన్! నాచేయి అప్పడే తెగకొట్టించుకోను. (చేయెత్తి) దీని అవసరం వుంది ఇంకా.

తెర.

# నాలుగో అంకం.

ఆరో రంగం.

గ్రామంలోని రచ్చబయలు. సాయంకాలపు పొద్దు. వేదిక సిద్ధంగా వుంది కాని, దానిమీదికి ఇంకా ఎవ్వరూ రాలేదు. బయలులో మధ్యగా నికోలాయ్ రోమనోవ్ ఏదో తవ్వుతూన్నాడు. రైతులు, ఆడాళ్లు ముసలవాళ్ళు, పిల్లలు, బయలులోకి నెమ్మదిగా ఒక్కొక్కరు గాను - జట్లు జట్లు గాను చేరుకుంటున్నారు. రోమనోవును చూసినప్పుడు ఆగి ఆశ్చర్యంతో చూస్తూన్నారు.

మొదటి రైతు స్త్రీ:— కోల్యా! ఏమిటా చేస్తూన్నది?

ఆమెకి గాని, తరువాతవారికిగాని రోమనోవు ఏమీ సమాధానం ఈయడు. ఊరికే తవ్వి పోస్తూంటాడు. చూసేవాళ్ళ వ్యాఖ్యానాలకి ప్రజలు నవ్వులూ వేళాకోళాలూ, ప్రకటిస్తూంటారు.

రెండో స్త్రీ :- కోల్యా! ఏమిటారి చేస్తూన్నావు?

మొదటి యువకుడు :- కోల్కా పాతుకోసం చూస్తూన్నాడు.

రెండవ యువకుడు:- పాతా! ఒరే కోల్యా! నేనూ వస్తానురా- మనిద్దరం పంచుకుందాం.

షిలోవ్:- ఉండండోయ్! ఏమిటోయి అది- కోల్యా.

కాటరీనా:- వెధవ చెప్పడేం? ఎవడికో ఘాత తలపెట్టేడు; నాకు తెలుసు.

మొదటి రైతు:- ఏదయినా పోయిందా ఏమిటారి?

రెండో ఆడది:- ఎవ్వడికీ తెలియదు. ఏమిటో పుట్టుముంగిలా తెగ తవ్వి పోస్తూన్నాడు.

కోటికిన్:- హాస్యం- అంత కంటె ఏంలేదు.

సోటిన్:- ఒక్క నిముషం ఆగవోయ్. వాసిలీ! ఇదంతా వేళా కోళం అని తోసి పారవేసీ లాగ తోచదు.

మూడో రైతు:- ఇదిగో, వీడి గొయ్యి వీడే తవ్వుకుంటున్నాడని నా నమ్మకం.

జనం అంతా:- గోరీయా?

మొదటి రైతు యువతి:- వాళ్ళ న్యూస్సాక్ నగల కోసం తవ్వుతూన్నాడేమోనరారి.

కాటరీనా:- ఇదేదో అశుభం తలపెట్టేడు...

మొదటి రైతు:- ఇంకో మట్టి గుడిసె కట్టుకుందుకు తవ్వుతున్నావా ఏమిటారి? మాతో కూడ చెప్పవోయ్, కాస్త. అంతా

చందాలు వేసుకొని అయినా కలప తెచ్చి ఇస్తాము.

ఒక మరాఠీడు:- నాకు తెలుసునయ్యా బాబు! రేడియో కోసం తవ్వుతూన్నాడు.

నాలుగో రైతు:- (దగ్గిరికి వచ్చి) ఏమిటి చేస్తున్నాడు?

రెండో రైతు:- కొత్త దేవాలయం కడుతూన్నాడేమో.

రెండో ఆడది:- అబ్బ! ఏడిపించక చెప్పరా.

అందరూ:- చెప్పరా— కోల్కా! చెప్పు. ఊఁ. మాట్లాడవే!

కోటిక్కిన్:- తప్పతాగి ఇల్లాంటి పాడుపనులు చేస్తూన్నందుకు ఇంక వాడిని ఇక్కడి నుంచి పంపేయ్యాలి.

సోటిన్:- బహుశా మీ కల్లు పాకలోనే త్రాగి వుంటాడు.

మూడో యువకుడు:- ఏం జరుగుతూందర్రా- ఇక్కడ?

రెండో యువకుడు:- కొత్త వింత. ఎవడో కాని అప్పుడే వేసిన ఆవు పేడని అమాంతంగా నరికేసేడుట.

మొదటి యువతి:- కోల్కా! వీళ్ళంతా పాపం ప్రాశ్నేయ పడుతూన్నారు— చెప్పవు! ఏమిటా తవ్వుతూన్నది!

రెండో యువకుడు:- ఒరేయ్! అంత తెగ నీలుగు కూడదురా.

ఒక ముసలివాడు:- కోల్కా! నేలంతా ఏమిటల్లా కెలుకుతావు? భూదేవి శపిస్తుంది సుమీ!

గ్రిన్‌కిన్:- అక్కడేమయినా ధాన్యం దాచలేదు కద! ప్రభుత్వానికి అమ్మడానికి పైకి తీస్తూన్నావా?

[మాట మాటకి నవ్వులు, జనసంఖ్య పెరుగుతుంది.]

మొదటి రైతు:— ఇదొక చావు వచ్చి పడిందే.

మొదటి యువతి:- అక్కడ ధాన్యం వున్నాయి. ధాన్యం!
(పక్కలు పట్టుకొని నవ్వుతుంది.)

కోటికిన్ :— (ముసి ముసి నవ్వులు నవ్వుతూ) ధాన్యం!

రోమనోవు:— (గట్టిగా అరుస్తాడు.) నోరు ముయ్యండి అంతా. (కోటికిన్‌తో) నీచుడా! అందరికంటె ముందుగా నువ్వు నోరు మూసుకో— వెర్రి వేషాలు వెయ్యక! (నిశ్శబ్దం.) నేనో రైలు రోడ్డు వేస్తూన్నా.

అనేక కంఠాలు:- ఏమిటి?- ఏమిటి అన్నాడు?— ఏమిటి అంటూన్నాడు?...

పిలోవు:— రైలు రోడ్డా! ఈ చిన్న పాకతో నువ్వు రైలు రోడ్డు వేస్తున్నావా! (ప్రజలంతా నవ్వు అణుచుకుంటూన్న ధ్వని.)

రెండో యువతి:- పాపం! మతిపోయింది!

ఓ[illegible]:- వేళాకోళాలకి తగిన అదును దొరికింది కాదు. చవట.

రోమనోవు:- నేనా చవటని? మీరు మాత్రం చవటలు కారూ? నా చుట్టూ వున్న వీరంతా ఎలాంటి వాళ్లు? అసలు చవటలు వీళ్ళే. (చుట్టూ చూస్తాడు.) ఇతరుల సాయం అవసరంలేకుండా నే రైలు రోడ్డు వేస్తూన్నందుకు నేను చవటని. కాని, ఇదుగో పదిహేను వందల మంది చవటలు— క్వాసోవు, అతని స్నేహితులు వీళ్ళని బ్రతికి యుండగా పీక్కు తింటున్నారు. అయినా సరే, వాడి వెనకాలే వుంటారు. కనిపించడం తర

వాయి, దూరాన్నుంచే సాష్టాంగపడి, చేతులు నలుపుగుంటూ వొదిగి నిలబడతారు. క్యాసోవు ఒక్కడు గ్రామం అశేషాన్ని చవటల్ని చేసి ఆడిస్తూన్నాడు. నేను మాత్రం ఒక్కణ్ణే రైలు గోడ్డు వెయ్యలేను!

కోటికిన్:— అయితే ఇదా నీప్రయత్నం! వెధవకబుర్లు చెప్పడానికి జనాన్ని పోగుచేయడానికిదో ఎత్తు.

క్యాసోవు:— నీకు ఆయాసం అంటూ లేదురా, కోల్కా! కాని, రైతులందరిని చవటలని తిట్టకు. అది మంచి పని కాదు.

కోటికిన్:— గ్రిమస్తులారా! ఈ పురుగు మనల్ని లోపలినుంచీ దొలిచి తినేస్తూంది.

సోటిన్.— తినేసే పురుగులూ వున్నాయి; సాములూ వున్నాయి. కోల్కా ఒక్కడే కాదు. అల్లాంటి వాళ్ళు చాలా మంది వున్నారు.

వృషులు:— నిజం! కోల్కా తెలివైన ఘటం! క్యాసోవుకి ఇంత వరకు చేసిన సేవలు నమస్కారాలు చాలును! హంతకుడు!

కాటరీనా:— దీనివలన ఏమీ ప్రయోజనం వుండదని చెప్పలేదు!

గ్రిన్కిన్:— ఆ మూర్ఖులంతా కొంతుకలు చించుకుంటూ పోతూన్నారు. ఉన్నది కాస్తా అమ్ముకు తినేసి సోమరి పోతుల్లా తిరుగుతూ ఎప్పటివానిదానికి నోరు తెరుచుకొని కూర్చుంటారు. మనం చెమటోడ్చి సంపాదించినది వాళ్ళకిచ్చి చూడండి; రెండు రోజుల్లో తగలేస్తారు.

కోటికిన్:- కోల్యా చెప్పినట్లు మనవాళ్ళో అంతా వట్టి చవటలు.

కోరికో:- కోల్యా! ఇల్లాంటి ప్రదర్శనాలు చేయడం తప్పు. ఇది వేళాకోళాలకి సమయం కాదు. చాల తీవ్రమైనవిషయం ఇది.

క్వాసోవు:- ఏమిటి ఆ తీవ్ర విషయం?

కోరికో:- నీ విషయమే.

క్వాసోవు:- నా విషయం ఏమిటి?

సోటిన్:- అంతా వున్నది, ఏదో నీ నిజవిషయం ప్రపంచం అంతా మరిచి పోయి చాలా కాలం అయింది. చేతనయితే బయటికి రా ఇప్పుడు.

కోటికిన్:- మా ఎదట బయటికి వచ్చి, ఏది ఆగింది— మేము నిల బడి ఆగడానికి!

సోటిన్:- (పిడికిలి ఎత్తి) కోటికిన్ మామా! ఒక్కటి అణిచేనంటే నేలకి అణగారి పోతావు- జాగ్రత్త!

ఓల్గా:- మీరు వచ్చింది మీటింగుకి కాని గుద్దులాటకి కాదు; కొంచెం శాంతించండి.

కోరికో:- కోల్యా! చూసేవా, అతి జాగ్రత్తగా ఆలోచించి వ్యవహరించ వలసిన సమయంలో కొట్లాటలు ఎల్లా వస్తాయో. అక్కా- తప్పుపని చేసేవు.

రోమనోవు:- అటిటి వాడివి కదా- తిట్టాడి ఎన్ని తిడతారో.

కోటికిన్:- ఏమిటిది? ఒక బికారి- త్రాగుబోతు, పెద్దమనిషిలా వచ్చి మనకి బుద్ధులు చెప్పడమా? అందరిని చవటలని తిట్టి,

కొట్టబోవడమా? మాటలే! సాగనిస్తామనే!

గోమనోవు:- నిన్ను చంపుతా.

కోటికిన్ మీద వురుకుతాడు. పెద్దగోల బయలు దేరుతుంది. మైకేలోవు, హైడోవు, రాయస్కీ, ఓల్గా, లొక్తేవ, జొటోవా, చాలా మంది పార్టీ సభ్యులు, కమ్యూనిస్టుయువకులు–యువతులు వస్తారు.

మైకేలోవు:- ఆగండి! ఆగండి!

జనం తప్పుకుంటారు. ఇద్దర్నీ విడదీస్తారు.

కోటికిన్:- (జాలిగా) వీడు నన్ను రక్తం వచ్చేలా కొట్టేడు.

గోమనోవు:- కొడతానురా! కొడతాను! నీ తేనెపట్లలో తేనే నీ వొంటికి పూసి చీమల పుట్టలో పారేస్తా.

మైకేలోవు:- పోట్లాటమానుతారా? సభలోంచి గెంటించాలా?

గోమనోవు:- నాకే రెండో చెయ్యి ఉంటేనా!...

మైకేలోవు:- ఏమి జరిగిందేమిటి?

ఓల్గా:- ఒక చిన్న పేచీ. సామాన్యంగా రైతులు తమ ఇకారాలు పోట్లాటతోనే నిర్ణయించుకుంటారు.

కోటికో:- కోల్యా ఇక్కడ ఒక తమాషా నాటకప్రదర్శనం ఆరంభించేడు. కాని, చివరకి అది పేచీలోకి దిగింది.

మైకేలోవు:- (గోమనోవుతో) నువ్వు ఎప్పుడూ తొందరపాటు మనిషివే. ఎప్పుడూ హడావిడే.

రోమనోవు:- నేను ఎంతో కాలం బ్రతికేదుండా ఏమిటి!

క్యాసోవు:- (వెక్కిరింతగా) అది మాత్రం నిజం!

మైకేలోవు:- (గిరుక్కున తిరిగి) ఓహో! క్యాసోవా! (క్యాసోవు నమస్కరించుతాడు.) రావయ్యా! డైడోవూ! మనం మీటింగు నారంభించుదాం. (కోరికోను పలకరించి) నిన్నటి మీటింగులో నువ్వెందుకు మాటలాడలేదు? పర్యవసానం ఏలాగ తేలిందో చూసేవా?

కోరికో:- డిమిట్రీ! నువ్వు మాత్రం ఏమిచేయగలుగుదువు? ఒక వేళ నన్ను పిలిచేడా? లేకుంటే మాటలాడనూ?

మైకేలోవు:- తప్పు! చాలా తప్పు! వాళ్ళు పిలిచేదాకా నువ్వు ఎందుకు ఊరుకున్నావు? పరిస్థితులు తప్పుదారిని పడుతూ న్నాయని తెలియగానే నువ్వు లేవవద్దూ.

కోరికో:- దానంతటు అదే అణిగిపోతుం దనుకున్నా. ఊరికే ఒక నిముషంలో జరిగిపోయింది అంతా.

మైకేలోవు:- ఓహో! (వేదిక వైపు వెడతాడు.)

క్యాసోవు:- (గ్రిన్‌కిన్‌ని పిలిచి) తెచ్చావా!

గ్రిన్‌కిన్:- కూడానే వుంది.

క్యాసోవు:- ఎక్కడ?

గ్రిన్‌కిన్:- ఇదిగో. (జేబు కుదుపుతాడు.)

క్యాసోవు:- సమయం మించనీకు. వాడు ఆఖరు చేయగానే ఎదట పడాలి. ఆలోచనకి ఖాళీ ఈయకూడదు.

గ్రిన్‌కిన్:- ఒక్క దెబ్బతో కుర్బాన్యా! అనేయ్యాలి.

డైడోవు:- (వేదిక మీదికి ఎక్కుతాడు.) గ్రామస్థులారా! నిన్న కుట్రదారుడయిన ఒక కులకునేత—వాడిని ఇప్పుడు జైలులో పెట్టేసేం లెండి.— భంగపరచబడిన మీటింగును మళ్ళీ ఇప్పుడు ప్రారంభించుదాం. (ప్రజలలో సంచలనం కలుగుతుంది.) జిల్లాకమిటీ కార్యదర్శి కామ్రేడ్ మైకేలోవు మాట్లాడుతాడు.

మైకేలోవు:- నిరుడు వేసవి కాలంలో ఒకమాటు వచ్చేను, ఇక్కడికి. జ్ఞాపకం వుందా? ధాన్యపు స్వీకృతిపను జరిపించుటకు ఆనాడు పోర్ప్కిన్‌ను విచారణ చేసేను. కోతలరోజులలో అతడు గ్రామంలోని ధాన్యం అంతనీ బుషెల్‌కి రూబులూ ఇరవయి కోపెక్కుల చొప్పున కొనేసేడు. తరవాత దానిపే నాలుగున్నర రూబుళ్ళ చొప్పున మీకే అమ్మేడు. ఆ విధంగా అతడు ఆరో-ఏడో వందల బుషెలుల ధాన్యం అమ్ముకున్నాడు. ఎంత లాభం వచ్చిందో తెలుసునా? ఇక్కడెవ- రెవరయినా లెక్క కడతారా?

రెండో రైతు:- మిష్కా అఫనాశీవు బుర్రలో లెక్కలు ఆడుతూ వుంటాయి.

మిష్కా:- ఆరు వందలయితే —(గొణుగుతూ) పంధొమ్మిది వందల యెనభయి రూబుళ్ళు, అదే ఏడు వందలయితే (మరల గొణుగుతాడు.) ఇరవయి మూడువందల పది.

మైకేలోవ్:— థాంక్స్. లెక్క సరిగానే కట్టేవు. రెండు వేల రూబుళ్ళు లాభం సంపాదించడానికి నిన్న క్యాసోవు మీ నోళ్ళు కట్టడానికి చేసినమాదిరిగా నూటఇరవయి పూడుల ధాన్యం ఎవడు పడితేవాడు పంచిపెడతాడు. (నిశ్శబ్దం) ఒక్క మాట అడుగుతాను చెప్పండి. వ్యవసాయం అభివృద్ధి చేయడం కోసమే ప్రభుత్వం ధాన్యం వసూలు చేస్తూంది. అదయినా ధర ఇచ్చి తీసుకుంటూంది. బజారుధర కంటె ఆ ధర తక్కువే అయినా ప్రభుత్వం ఆలాగే కొంటూన్నారు, అమ్ముతూన్నారు. ఈ సంగతి బీదరైతులకి తెలుసు. సామాన్యపు రైతుకి మాత్రం తెలియదు? కాని, కులకు తన ధాన్యమే కాకుండా గ్రామంలోని ధాన్యం అంతనీ కూడా ప్రభుత్వానికి చిక్కకుండా తానే కొనేసి, పాతరలు వేసు కుంటూ వున్నాడు. ఎందుకో తెలుసా?

పి.క్రా:— నువ్వే చెప్పు.

మైకేలోవ్:— చెప్తా. కోతకాలం వచ్చిందంటే రైతులు కాలి జోళ్లు కొనుక్కోవాలి. బట్టలు కొనుక్కోవాలి. పన్నులు చెల్లించాలి. ఆ మరమ్మతు ఈ మరమ్మతు చేయించుకోవాలి. కులక్‌లు సమయం కనిపెడతారు. బజారులో ధరలు హెచ్చగానే తమ సరుకుల్ని అమ్మజూపుతారు, సమయం కనిపెట్టి.

[illegible]మనోవు:— గోధుమపిండి బస్తాలు వేసి, బళ్లు బజారులోకి తోలు కొస్తారు.

మైకేలోవు:- ఏమంటారు? అదే బాగుంటుందా? రైతు అయి దో ఆరో రూబుళ్ళకి అమ్ముకున్న దానిని, కులకు పదిహేను రూబుళ్ళకి అమ్ముకుంటాడు. అది సరి కాదు. మీరు కూడా ప్రతివారూ చేస్తున్నట్లుగా ప్రభుత్వానికి మీ ధాన్యం మామూలు ధర కమ్మండి.

ధ్వనులు:- నిజం! నిజం చెప్పేడు! అందరూ అమ్మినట్టే అమ్మాలి.

ప్రజలు వేదిక చుట్టూ మూగుతారు.

గ్రిన్‌కిన్:- మా గ్రామంలో కులకు లెవ్వరూ లేరు.

మైకేలోవు:- మరీ మంచిది. ఆపద్ధతిలో ధాన్యం అందరి దగ్గరా సమానంగానే వసూలు చేదాం. ఇదిగో నా దగ్గర ఒక పట్టిక వుంది. చదువుతా. సరిగా వుందో లేదో చెప్పండి. అసలు పరిస్థితు లివి. మాకు ఏడు వేల పూడుల ధాన్యం కావాలి. మొదట గ్రామంలో నూటికి ఎనభయి మందిని వదలి, మిగతా ఇరవైమంది దగ్గరా ఈ ధాన్యం వసూలు చేయాలనుకున్నాము. ఆ ఇరవైమందిలోనూ కూడా బాగా డబ్బున్న కులకుల దగ్గర నాలుగువేలూ, మిగిలిన వారివద్ద తతిమ్మా ధాన్యమూ వసూలు చేయాలనుకున్నాం. కాని, మీ గ్రామంలో అసలు కులకులే లేరంటూన్నారు, గనుక ఇప్పుడీ ధాన్యం ఊరందరి నుంచీ వసూలు చేస్తాం.

షిలోవు:- ఏమన్నావు? ఊరందరి నుంచీనా?

మొదటి రైతు స్త్రీ:- అబ్బెబ్బే! అది మంచిపని కాదు.

ధ్వనులు:- అదంతా ఆ ఇగ్నేషియసు దగ్గరనే వసూలు చేయండి.

రెండో రైతు:- కులకుల గొంతుక నొక్కండి.

ధ్వనులు:- చేయవలసింది అదే. కులకుల దగ్గరనే వసూలు చేయాలంతా.

మూడో రైతు:- అందరూ అమ్మినట్లే వారినీ అమ్మమనండి.

ఓల్గా:- క్యాసోవు వద్ద వేయి పూడులున్నాయి. నా దగ్గిర పదిహేనే వున్నాయి. నేనూ, అతనూ, కూడా పదేసేనా ఈయడం! అతను అందమయిన తోలు బూట్లు కొనుక్కుంటూ వుంటే నేను గుడ్డలయినా లేక చలిలో బాధ పడుతున్నా.

క్యాసోవు:- అప్పుడే మరిచిపోయేవు! నిజుడు నీకు సాయం చేసినది ఎవరో?

ఓల్గా:- నాకు సాయం చేసేవు, నిజమే! ఆ అప్పు తీసుకోడంలో నా ప్రాణాలు కూడా హరించేవు. వాటిని నీ గాదులలో వేసి తాళం వేసుకున్నావు. (నవ్వుతాడు.)

కోరిక్:- నాకు కొంచెం అవకాశం ఇయ్యగలరా?

మైకేలోవు:- కోరిక్ ఇగ్నట్! రా. వేదిక మీదికి రా.

కోరిక్ ముందుకి వచ్చేడు.

క్యాసోవు:- (గ్రిన్‌కిన్‌ను గోకుతాడు.) ఇదే సమయం.

గ్రిన్‌కిన్:- ఇదిగో వెళుతూన్నా. (గట్టిగా) కామ్రేడ్ మైకేలోవు! నే నొక ప్రశ్న వేయవచ్చునా?

మైకేలోవు:- కానీ.

గ్రన్‌కిన్:- దగ్గరగా రావచ్చునా?

మైకేలోవ్:- రా. (జనం తప్పుకుని దారి ఇస్తారు. అతడు నెమ్మదిగా ముందుకి వస్తాడు. అందరూ అతని వైపే చూస్తూంటారు. గ్రిన్‌కిన్ వేదికదగ్గరకిరాగానే జేబులో చేయిపెట్టి, రెండు గుప్పిళ్ళ గింజలు పైకి తీస్తాడు.) ఊఁ. ఏమిటి?

గ్రిన్‌కిన్:- నేనూ నా కొడుకూ వేరు పడ్డాము. నేను పాతపద్ధతులలోనే పని చేస్తూన్నాను. మావాడు నూతనమార్గాలలో పని చేస్తూన్నాడు. ఇవిగో మా యిద్దరి ఫలితాలు, చూడు. ఏవి మంచివో.

మైకేలోవ్:- (రెండు చేతులూ జాపుతాడు. చేతులోకి గింజలు తీసుకుని పరీక్షించుతాడు. రెండు నమూనాలూ నిదానంగా పరిశీలించుతాడు. జనం నిశ్శబ్దంగా చూస్తూంటారు.) నన్ను బుట్టలో పెడదా మనుకుంటున్నావేం, పాపం! ఇందులోఒకటి వేసవి పంటా, రెండోది శీతాకాలపు పంటా. (నవ్వుతాడు.) నువ్వు తమాషామనిషివే! నేనుకూడా తమాషా చూపుతా చూడు. (జేబులో చేయి పెట్టి, గుప్పెడు గింజలు పైకి తీస్తాడు.) ఈలాగ వచ్చి ఈ గింజలొకమారు చూడు.

గ్రిన్‌కిన్:- ఓరి బాబో! ఇవెక్కడివి గింజలు?

మైకేలోవ్:- మమ్మల్ని కూడా చూడనివ్వండి!

రైతు లంతా దగ్గరగా మూగుతారు. గింజలు ఒకరి తరవాత నొకరు అందుకుంటారు.

మొదటి రైతు:- ఈలాగ ఇవ్వండి!

మూడో రైతు:- కాస్త దారి ఇవ్వండి. —మళ్ళీ ఇంకో మారు చూడనియ్యండి!

రెండో రైతు:- అవీ ధాన్యం అంటే.

ఓల్గా:— ఏమి ధాన్యం! ఏమి ధాన్యం! అమెరికానుంచి మచ్చుకి తెప్పించేరా?

మైకేలోవు:— లేదు. తెప్పించినవి కాదు. ఇక్కడికి వచ్చేముందు 'లెనిన్ సమిష్టివ్యవసాయక్షేత్రం' మీదుగా వచ్చేను. వారి పంట ఒకటి రెండి పిడికిళ్ళు తెస్తే మంచిదని తోచింది. తీసుకువచ్చేను. మంచి రాలిక రాలింది. కొన్ని ప్రదేశాలలో ఎకరాకి, కొన్ని చోట్ల తొంభయి.

గ్రిన్‌కిన్:— తొంభయ్యా! అబద్ధమేమో!

మైకేలోవు:— అక్కడికి పోయి చూసిరా.

ఓల్గా:- ఆఖరుకి ఎకరాకి అయినా మనకంటె మెరుగే.

రోమనోవు:— ఫరవా లేదు. మనమూ ఆలాంటి పంట పండించుకోగలం——

కోటికిన్:- (వెక్కిరింతగా) కోల్లోజ్ — సమిష్టివ్యసాయక్షేత్రానికి— మన కోల్కా దారి చూపుతాడు.

సోటిన్:- నిన్ను తీసుకువెళ్ళడులే, భయపడకు.

అఫనాశీవు:- నిన్ను గుమ్మంలోకూడా అడుగు పెట్టనియ్యారు.

ఓల్గా:- నువ్వు నన్ను తీసుకువెడతావా?

రోమనోవు:- నీ యంతట నువ్వే వెళతావు. ఊరికే వెళ్ళడం కాదు. ఉరకలు వేసుకుంటూ పరుగెడతావు.

ఓల్గా:- నేను!

కోరికో:- ఎందుకు కాదు? నువ్వుకూడా పరుగెడతావు. నాకు ఒక విషయం తడుతూంది. ఈవేళ పొద్దుటే పొయ్యి దగ్గర కంటికెదురుగా వున్న కాలి జోళ్ళకోసం రెండు గంటలసేపు తెగ వెతికేను — ఆ సమయంలో తోచింది... చూడండి! ప్రభుత్వానికి ధాన్యం కావాలి. వాసిలీ! నువ్వు ఇల్లు కట్టుకున్నప్పుడు ఏం చేసేవు? అతిక్లుప్తంగా వాడుకుని, దొరికినచోటనల్లా డబ్బు డబ్బుదగ్గరనుంచి అప్పు చేసేవుకదా? అలాగంటిది ప్రభుత్వం తన అయిదేళ్ళ అంచనా పూర్తిచేయాలంటే ఏమి చేయాలో నువ్వే చెప్పు.

ఓల్గా:- నిజం!

కోరికో:- సరిగ్గా అదీ సంగతి. మనకున్న దంతా ప్రభుత్వానికి ఇవ్వకపోతే సర్వనాశనం అయిపోతుంది.

శేకలు:- బాగుంది! నిజం!

కాటరీనా:- మనం ఏమి చేయగలం?

కోరికో:- మనం కూడా ఒక విశేషమయిన ఆర్థిక ప్రణాళిక ననుసరించాలి. నే చెప్పేది కొంచెం శ్రద్ధగా వినండి. మన గ్రామంలో వేయింటికి ఎక్కువగా ఇంటి పెరళ్ళు వున్నాయి. ఎందుకూ పనికి రాకుండా చెత్తతో నిండిన కొంపలూ వు

న్నాయి. ఇవన్నీ ఆరు మైళ్ళ నేల నావరించి వున్నాయి. ఈ భూమి అంతా దున్నుకో గలిగితే ఆలోచించుకోండి... ఊఁ. మన పూరి కొంపలన్నీ పీకేసుకుని, వానికి బదులుగా ఒకటి రెండు మేడలు వేసుకుంటే...

కాటుకీనా:- ఏయ్! ఏయ్! ఏమిటీ వాగుడు!

మూడో రైతు:- ష్!

కోరికో:- మన దగ్గర రెండువేల రూకలున్నాయి. లెక్క వెయ్యండి! ఒక్కొక్కటి— గింజల లెక్కలో— రోజుకి అధమం పాను గింజలకి తక్కువ తినదు. అంటే ఏడాదికి ఇరవయి నిండు బళ్ళ ధాన్యం అయిపోతూం దన్నమాట.

పిలోవు:- రూకలకోసం అంత ఖర్చే?

కోరికో:- (నూతన భావాల చేత ఉద్రిక్తుడై) ఒక గుర్రం— దేవుడి దయ వుంటే భయం లేదు— చచ్చిపోతుం దనుకోండి. అంతటితో మనపని అయిపోయినట్లే. కాని అందరికీ సంబంధించిన గుర్రాలు అయిదు వందలుంటే మన వ్యవసాయం ఎంత బాగుంటుందో ఆలోచించండి! ఇప్పుడు మన భూమి చిన్న చిన్న ఖండాలుగా వుంది. ప్రతి రైతూ అన్ని పనులూ ఇతరుడి సాయం లేకుండా ఒక్కడూ చేసుకోవలసి వస్తూంది. కాని, పొలం పెద్దదిగా వుంటే పనిభారం అందరికీ సమంగా వుంటుంది. చీమ చూడండి!- ఎక్కడికో పోయి వెతకనక్కరలేదు.- చీమ కూడా గడ్డిపరకని తానొక్కతే మోయదు.

ఆ చీనుకూడా భగవంతుడి సృష్టే నన్న మాట మరవకండి. ఇదే నా ఆలోచన.

కోటికిన్:- మంత్రివర్యా! మిమ్మల్ని ఎవ్వరూ ఉపన్యాసం ఇవ్వమనలేదు. ధాన్యం సంగతి చెప్పు.

కోటికో:- ఇంక ధాన్యం విషయం! మనం ప్రభుత్వానికి అమ్మవలసిందే. ముఖ్యంగా తమ అవసరానికి మించి సరుకుగలవారు అమ్మితీరాలి. మా దగ్గర ఎంత ధాన్యం వుందో మనం ఎరగకుండా లేము.

క్వాసోవు:- ఆ మాట ఋజువు చేయగలవా?

కోటికో:- ఇవాన్! అందరూ ఎరిగిన దానికి సాక్ష్యాలతో పనిలేదు. సూర్యుడు పొద్దుటే వుదయించుతాడనీ, పగటిపూట ఆకాశంమీద వుండి సాయంకాలం కాగానే జపానువాళ్ళ దేశం దగ్గర దిగిపోతాడనీ, నువ్వు ఋజువు చేయి చూదాం. ఏమిటోయ్! మహా ఋజువంటావు.

కోటికిన్:- నీ దగ్గర అసలు ధాన్యమే లేదనుకుంటాను.

కోటికో:- నువ్వు అన్నది యదార్థమే. కాని, కొంచెం లేక పోలేదు. అయితేనేం, ఆ బాధ్యత ఏదో నా మీదనే వేసేవు, గనక నేనో మార్గం చెబుతా, వింటావా? నా దగ్గరున్న దానిలో సగం ఇస్తాను. నీ దానిలో సగం ఇస్తావా?

ఓబ్లా:- అది న్యాయంగానే వుంది. కోటికిన్! తే. ఐదువందలూ.

కోటికిన్:- (భయంతో) వేయిపూడుల ధాన్యం నా కెక్కడిది!

నా కొంపలో ఎంత వెదికినా ఐదువందలు దొరకవు.

రెండో రైతు:- మిగిలిన ఐదువందలూ తేనెటీగలకి తినిపించేసేడు కాబోలు. (నవ్వు.)

సోటిన్:- మనపని ముగియనియ్యండి. పేర్లు చదవనియ్యండి.

మైకేలోవు:- పొరుగులారా! ఆ పట్టిక నంతనీ చదివి మిమ్మల్నందరినీ విసిగించ పనిలేదు. దీనిని మామూలుగా సోవియటు కార్యాలయానికి వప్పచెబుతాము. వారినే నిర్ణయించనిద్దాం. ఏమంటారు!

షిలోవు:- అదే మంచిది.

ఓల్గా:- వారు ఆలోచించేటప్పుడు మేం వుండొచ్చా!

మైకేలోవు:- ఒక్క కులకులు మినహాగా అంతా రావచ్చు.

కోటికిన్:- సోదరరైతులారా! వీళ్ళు మనలో మనకే పేచీలు పెంచతానికి ప్రయత్నించుతున్నారు. గొర్రెల్ని విడదీసిన మాదిరిగా విడదీస్తున్నారు. రైతులలో తెగలు చెప్పాలంటే, సోమరిపోతులు, పనిపాటలు చేసుకొనే వారూ, అని మాత్రం విడదీయాలి. కులకులనే మాట పట్టణవాసుల సృష్టి.

మైకేలోవు:- కోటికిన్!

కోటికిన్:- ఏం!

మైకేలోవు:- ఏమిటో పట్టణవాసులంటున్నావులే.

కోటికిన్:- నేనా! అబ్బే! మరేమీ లేదు. నా కేవో సందేహాలు వుండిపోయినాయి. సమాధానం చెబుతావా!

మైకేలోవు:- నీ సందేహం ఏమిటో నాకూ తెలుసు. కానీ.

కోటికిన్:- రైతు నెత్తిన ఇంతభారం ఎందుకు మోపుతూన్నారు. నగరవాసుల్ని ఇంతగా బాధించరేం? ప్రభుత్వానికి ఫ్యాక్టరీ కూలీలు కన్నబిడ్డలూ, రష్యాకి తిండి పెట్టే రైతులు సవితి బిడ్డలూనా?

మైకేలోవు:- అంటే ఫ్యాక్టరీకూలీలు మీ కంటె ఎక్కువగా సుఖపడుతూన్నారనా నీ భావం?

ధ్వనులు:- భగవంతుడు మా కటువంటి జీవితం ఇస్తే చాలును.... మా కంటె ఎక్కువగానేనా? ఔను!... నా వుద్దేశ్యం ఔ ననే! ... మేము ఎప్పటి కయినా ఆ విధంగా జీవించగలమా?

ఓల్గా:- మమ్మల్ని కూడా అలాగే ఆదరించాలి. మాకూ జీతాలు ఇయ్యాలి.

మైకేలోవు:- మీకు జీతాలు కావాలా? సరే! బాగానేవుంది. డైనోవూ! ఒక కాగితం తీసుకుని వ్రాయి. మా జిల్లాలో ఒక ఇటీకల ఫ్యాక్టరీ కడుతూన్నాము. ఉన్నవాళ్ళు గాక అదనంగా రెండువేలమంది కూలీలు గావాలి. ఈన పొలంవద లుకో దలచిన వారెవరేనా వుంటే, మీ పేరు డైనోవుతో చెప్పండి. మిమ్మల్ని నగరానికి తీసుకుపోతాము. మీరా ఫ్యాక్టరీలలో పనిచేయువచ్చును. జీతాలు సంపాదించుకోవచ్చును. (చుట్టుతిరిగి చూస్తాడు. రైతులు మొగం తిప్పుకుంటాడు.) ఓం ఎవ్వరూ రారూ? ఊరికే గోలచేయడమేనా? సరే! అయిం

దా ఇక్కడికి?

ఓల్గా:- మా పని తీరిందనే తోస్తుంది. మీ పని కానియ్యండి!

మైకేలోవ్:- నే పోవాలి. కామేరెడ్ రాయస్కీ ఇక్కడనే వుంటాడు. మిగిలిన సంగతులు అతనే చూసుకుంటాడు.

డైడోవ్:- అంతే!

ఉద్రేకంతో రైతులు వెళ్ళిపోతారు.

మైకేలోవ్:- (వేదిక దిగి ఓల్గా-రాయస్కీల వద్దకి వస్తాడు.) అమ్మయ్య! ఇప్పటికి తెమిలింది. దొవిమ్మ జరగనేలేను. ఓల్గా! నీతో ఒక మాట చెప్పాలి.

రాయస్కీ తప్పుకుంటాడు.

ఓల్గా:- చెప్పు.

మైకేలోవ్:- నన్ను ఒకరోజు ఇక్కడుండ మంటావా?

ఓల్గా:- నీ యిష్టం!

మైకేలోవ్:- తోచిందా వుండొచ్చు. లేదా పోవచ్చును. మనం ఇద్దరం కోరికతో యింట వుందాం.

ఓల్గా:- మనం ఇద్దరం కలిసివుండడం పడదు.

మైకేలోవ్:- (ఒక్క నిముషం వూరుకుని) ఓహో! అయితే వ్యవహారం ఇంతవరకూ వచ్చిందన్న మాట... ఊహూఁ. ఇది ఈ లాగవుందా... ఆ పద్ధతిలో ...బాగుంది.— తిన్నగా వెళ్ళిపోవడమే మంచిదనుకుంటాను.

ఓల్గా:- నీ యిష్టం...

మైకేలోవు:— కాని,- సరే! ఏదో తిరకాసు వచ్చింది. ... ఆఖరికి ఏలాగ' వచ్చింది? ... ఊహుఁ. మనం ఎంత త్వరగా ఇట నుంచి పోతే అంత మంచిది.... డైడోవూ!

డైడోవు:- ఏమిటి?

మైకేలోవు:- గుర్రాలు సిద్ధంగా వున్నాయా?

డైడోవు:- మీరు చెప్పినట్లు అన్నీ సిద్ధంగా వున్నాయి.

మైకేలోవు:- కామ్రేడ్స్! మీ అందరికీ ఆలస్యం అవుతూంది.

మైకేలోవు హడావిడిగా వెళ్ళిపోతాడు. డైడోవు లోట్కేవ్, జొటోవా, ఇతర కమ్యూనిస్టుయువకులు, వెంబడిస్తారు.

రాయస్కీ:—(ఓల్గాని సమీపించి) ఏమిటి మాటాడా లంటాడు?

ఓల్గా:- మరేమీ లేదు. కాని, పావేల్! ఈ మారూ గెలుపు ఆతనిదే.

రాయస్కీ:— ఆతనితో చెప్పేవా?

ఓల్గా:- ఆహా!

రాయస్కీ:- మనం ఈ పరిస్థితుల్ని చక్కబెట్టుకో లేక పోయామని ఆతను స్వయంగా తెలుసుకున్నాడు.

ఓల్గా:- మనం కాదు.— నువ్వు.

రాయస్కీ:- కొద్దిగంటల క్రితమే కాదూ, నువ్వు 'మనం' అని వుపయోగించేవు!

ఓల్గా:- కాని, వెంటనే ఒక సమావేశం జరిగింది. దానిలో దొమ్మి జరుగుతుందని నువ్వు జంకేవు. ఆ బాధ్యత తీసుకొనడానికి నువ్వూ, డైడోవ్వూ, కూడా జంకేరు. మనం అద్భుతంగా ఓడిపోయినాక కూడా ఆతడు సభ జరపడానికి ఏమాత్రం జంక లేదు!

రాయస్కీ:- పోనీ! ఓడిపోయినాం. దేవుడే వున్నా డన్నింటికీ.

ఓల్గా:- ఏలాగ జరిగిందో యింతవరకు నా కర్థం కాలేదు. హఠాత్తుగా నీ ధైర్యం చెడింది. ఎవరో చిలిపిమనిషిలా అయిపోయినావు. ఎవరూ అనివుండని మాట లాడేవు. నీ ప్రకృతికే విరుద్ధంగా మాటలాడేవు. నువ్వు ఆ రాయస్కీవే కాదు. ఆ మనిషే వేరు. ఇదేమిటి ఈలాగ అయింది. (రాయస్కీ కాలరు మెలి వేస్తూంటాడు.) ఏమి టా పని.

రాయస్కీ:- ఏమీ లేదు. మెడపట్టీ కొంచెం బిగువుగా వుంది. గొంతుక ఒత్తుతూంది. కానీ, చెప్పు.

ఓల్గా:- 'నెక్ టై' ముడి కొంచెం బిగువుగా వేసుకొని వుంటావు. నెక్ టై? నీ నెక్ టై కూడా అందరికీ ఉన్న మాదిరివే.

ఒక కుర్రాడు:- (పరుగెత్తుకొని వచ్చి) బాబుగారూ! మీకు ఈ జాబు ఇచ్చేరు ఆయన ఎవరో గాని.

కాగితం ఇచ్చి పారిపోతాడు.

రాయస్కీ:- నాకు ఈ చీటి పంపించిన వారెవరు? (చదివి చాలా ఉద్రేకం పొందుతాడు.) ఏడీ! ఆ కుర్రాడు ఏడీ?

(తిరిగి చూస్తాడు.) డైడోఫ్రూ! అలారం గంట వాయించి రైతుల్ని వెనక్కి పిలు.

ఓల్గా:- ఏమి జరిగింది?

రాయస్కీ:- ఆగు... ఏయ్! పిల్లలూ! యువజనసంఘం వారు! వెళ్ళండి!...ప్రతివాడినీ వెనక్కి పిలవండి!

కమ్యూనిస్టుయువకులు పరుగెత్తి వెడతారు. గ్రామంలో అలారంగంట మోగుతుంది. భయంతోటీ, ఆశ్చర్యంతోటీ, రైతులంతా మళ్ళీ వస్తారు. రాయస్కీ ఒక్కడే వేదికమీద నిలుస్తాడు. విచారంతో ప్రజల్ని చూస్తూంటాడు.

పిలోవు:- మమ్మల్ని ఎందుకు పిలిచేరు?

రాయస్కీ:- (ప్రతిమాట నొక్కి, విస్ఫుటంగా, పలుకుతాడు.) నా కిప్పుడే ఈ వుత్తరం పంపించేరు. ఇందులో వున్న దిది. (చదువుతాడు.) "ఓ ప్రతినిధీ! ఒక మీటింగులో నీ కిదివరకు బుద్ధి చెప్పేము. అయినా నువ్వు ఇక్కడినుంచి వదల లేదు. మా సలహా విని, నీ శవపేటికకు సిద్ధం చేసుకుందుకు తగిన ప్రయత్నాలు చేసుకో. నువ్వు ఇంక ఎంతో కాలం బ్రతుకవు. నీ ప్రాణాలు తీయగల తూటా సిద్ధం చేయబడింది. ధాన్యపు వసూళ్ళకి పరలోకం పోవలసిన సమయం వచ్చింది. నీ రోజులు దగ్గర పడినాయి." (ఆపలేని కోపంతో) ఈ చీటీ విలువ

చాలా అధికం. దీని ఖరీదు రెండు వేల పూడులు. తెల్లవారేట ప్పటికి ఈ చీటి వ్రాసిన మనిషిని నా యెదట పెట్టకపోతే, మీ రిదివరకు ఇచ్చుకోవాలన్న ఏడువేలకీ, మరి రెండు వేల పూడులు ఇచ్చుకోవాలి. ఇంకా చీటీలు వచ్చేయా, శిక్ష నాలుగు వేలు!

నిశ్శబ్దం.

ఓల్గా:- ఇదేమి టీలాగ వచ్చిపడింది? ఆ జాబు వ్రాసింది ఎవ్వరో దేవుడికే తెలియాలి. కాని, దానిని గురించి బాధపడవలసింది మనమం?

రాయస్కీ:- మాటలాడవద్దు. ఆ తూటా ఎవ్వరి కోసం సిద్ధంచేసిరో నేను చెప్తా.

వేదిక దిగి, అటూ-యిటూ చూడకుండా ప్రజల మధ్య నుంచి నడుస్తాడు. వారు దారి ఇస్తారు.

తెర.

ఏడో రంగం.

క్యాపోవు ఇల్లు. ఓల్గా రివాల్వరు నొక దానిని తుడిచి బాగుచేస్తూంటుంది. రాయస్కీ బల్లవద్ద కూర్చుండి వ్రాసుకుంటున్నాడు. అతని ప్రక్కన జొటోవా నిలబడివుంది.

రాయస్కీ:- (వ్రాత పూర్తిచేసి, కాగితం జొటోవా కిస్తాడు.)
ఇదిగో. దీనిని తీసుకుపోయి డ్రైవరు చేతికియ్యి. ఏవిధమైన ఆలస్యం చేయకుండా మనవారి నందరినీ తీసుకురాండి. మీ ఆయుధాలన్నీ వెంటతెచ్చుకోండి. ఒక్క క్షణంలో నేనూ మిమ్మల్ని కలుసుకుంటాను.

ఓల్గా:- ఇప్పుడే వచ్చేస్తూన్నాము.

రాయస్కీ:- ప్రమాదంలోకి రాబోకు ఓల్గా!

ఓల్గా:- బహుశా నేను దాగుకొని వుంటాననే అనుకున్నావా? ఇదిగో 'ప్రొనింగ్' తయారయింది.

రాయస్కీ:- వెడదాం, లే. (జొటోవాతో) మీవాళ్ళు ఏలాంటివాళ్ళు. నమ్మవచ్చా?

జోటోవా:— ఆఁ. నమ్మవచ్చు. ఈ పేచీ వచ్చినప్పటినుంచీ, లోక్ష్కేవు ఇంటింటికీ తిరుగుతూన్నాడు. ఆతడు ప్రజల్ని శాంత పరచడానికి చెడతిరుగుతూన్నాడు.

రాయస్కీ:- పికికిపంద. జోటోవా! నడు.

జోటోవా:- ఇదిగో. క్షణంలో. (పరుగిడుతుంది.)

రాయస్కీ:- యుద్ధపరిస్థితులు వచ్చేయి. ఓల్గా! నీకు భయంలేదు గదా!

ఓల్గా:— నా కేమీ భయంలేదు.

రాయస్కీ:- తుపాను వస్తూంది. గుర్రాన్ని పరుగెత్తిస్తా.

ఓల్గా:- శత్రుశిబిరంలో ప్రవేసిస్తావా యేం?

రాయస్కీ:— 1919 లో తిరుగుబాటుచేసిన ఒకపటాలాన్ని ఎదుర్కున్నా. నాతో ఇంకెవ్వరూ లేరు. సైనికులు వాళ్ళ డివిజన్ కోసం ఎదురుచూస్తూ, యుద్ధానికి తయారవుతున్నారు. తిన్నగా వాళ్ళ దగ్గరకి గుర్రాన్ని పరుగెత్తించేను. అందరూ చూస్తూండగా వారి నాయకుడిని కాల్చిపారేసేను. తరవాత ఆ బెటాలియనే మా డివిజన్‌లో ఒకభాగం అయింది.

ఓల్గా:- నువ్వు పొడుగు ఎదిగినట్లు కనబడుతూన్నావు.

మైకేలోవు లోనికి వస్తాడు. వస్తూనే తనసామాను లోకమూల పడవేస్తాడు. క్వాసోవుగదిలో కున్న ద్వారంవద్దకి వెళ్ళి, తలుపు తెరచి, తొంగిచూస్తాడు.

రాయస్కీ:- ఇంట్లో ఎవ్వరూ లేరు, జోగిని మినహా.

[మైకేలోవు లోనికి వస్తాడు.]

మైకేలోవు:- ఆఖరికి పరిస్థితులు ఇంతవిషమావస్థలోకి తీసుకువచ్చే వేమిటి? విచారణ జరిపించుకోవాలని వుందా? 'రాస్తువో' లో వుండగా లోక్టేవు టెలిఫోను చేసేడు. పరుగెత్తుకుని వచ్చేను.

రాయస్కీ:- మరేమీ కంగారు లేదు.

మైకేలోవు:- గ్రామం అంతా అట్టుడికి పోతూందని ఈ పాటికి గ్రహించే వుంటా వనుకుంటా. ఈ వేళ జనం అంతా మనల్ని ఎదురోక్క వచ్చు.

రాయస్కీ:- తిరుగుబాటుని అణిచి వెయ్యడానికి కావలసిన ప్రయత్నాలన్నీ చేసేను.

మైకేలోవు:- నీ ఆజ్ఞల్ని ఉపసంహరించుకున్నా వనుకుంటాను.

రాయస్కీ:- కమ్యూనిస్టు యువకుల కందరికీ ఆయుధా లిమ్మని ఆజ్ఞాపించేను.

మైకేలోవు:- నీ ఆజ్ఞని రద్దుచేసు కున్నావా?

రాయస్కీ:- నే నేం పిరికి పందను కాను. ఆవిషయం నీకు బాగా తెలుసును.

మైకేలోవు:- ఆ తెలివి తక్కువ ఆజ్ఞని వెంటనే రద్దు చేసుకొని గ్రామంలోని ప్రతి రైతుకీ ఆ విషయం తెలియ పరచ మని ఆజ్ఞాపిస్తూ న్నా.

రాయస్కీ:- ఎన్నటికీ జరగదు.

మైకేలోవు:- స్వయంగా నేనే ఆపని చెయ్యగలను. కాని, నలు

గురిలోనూ నిన్ను హాస్యాస్పదం చేయడం నాకు ఇష్టంలేదు. ఏదిఏమైనా, ధాన్యం వసూలు చేయడానికి ఇక్కడ వుండే వాడివి నువ్వు.

రాయస్కీ:- (కోపంతో) నా ఆజ్ఞని ఉపసంహరించుకోను. నిన్ను అలాగ చేయనీయను. తిరుగుబాటు వస్తుందని బెదిరించినంత మాత్రం చేత ఆజ్ఞని ఉపసంహరించుకోవడమా? నీది పిరికిపని. పార్టీకి అప్రతిష్ట కూడాను...

మైకేలోవు:- పావెల్! తొందర పడకు. తెలివి తక్కువ పనులు చేసి పైగా ఆతప్పులు దిద్దుకోనక పోవడం మూలాన పార్టీకి అప్రతిష్ట కలుగుతుందే కాని,...

రాయస్కీ:- చేసింది పొరపాటని ముందు ఋజువు చెయ్యి. గ్రామస్థులు మన సైనికుల్ని చంపి నప్పుడు నువ్వే గ్రామం అంతమీదా శిక్షారుసుము వసూలు చేసే వాడివి.

మైకేలోవు:- నేను శతృవులకి శిక్షలు వేసేవాడిని. ఇప్పుడు నువ్వు శత్రుమధ్యంలో వున్నావా?

రాయస్కీ:- వాళ్ళు కులకుల్ని మద్దతు చేసినంత కాలం శత్రువు లన్న మాటే.

మైకేలోవు:- వాళ్ళు కులకులతో కలియడం తప్పని సరిగా తెచ్చి పెట్టేవు. గ్రామం అందర్నీ నీకు శతృవుల్ని చేసుకున్నావు. ధాన్యం వసూలుకీ, శిక్షాధనం వసూలుకీ ఏలాగ ముడిపెట్టేవు! నువ్వెవరివి? తన వలస రాజ్యాలు సరిచూడ వచ్చిన ఇంగ్లీషు

పరిభవువా? ఈ పట్లన్నీ విదేశాలలో నేర్చేవా?

రాయస్కీ:- అయితేనే వుద్దేశ్యం చంపతూన్నా వూరుకోమనా?

మైకేలోవు:- కులకులు తిప్ప నిన్ను చంపేది ఎవరు? ఆ కులకులు మనం వాళ్ళ ధాన్యం దోచుకుంటూన్నామనీ, మనం దొంగలమనీ, కంఠం పొడి ఆయేటట్లు అరుస్తూనే వున్నారు. నీశక్తి వంచన లేకుండా వాళ్ళకి సాయం చేసేవు. ఆ పొరపాటు సర్దుకో. నీ ఆజ్ఞ పార్టీ విధానానికి వ్యతిరేకంగా వుందని నువ్వే చూపాలి.

రాయస్కీ:- ఆపని చేసి మళ్ళీ ఈ వూళ్ళో తలెత్తుగుని తిరగ్గలనా?

మైకేలోవు:- పార్టీ సిద్ధాంతాన్ని సక్రమంగా అనుసరించడం కంటె నీ వ్యక్తి గౌరవాన్ని కాపాడు కోవడమే ముఖ్యమని ఊహిస్తూన్నావన్న మాట.

రాయస్కీ:- నేను నా ఆజ్ఞ తగ్గించుకోను.

మైకేలోవు:- తగ్గించుకు తీరాలి.

రాయస్కీ:- ఊహూఁ.

మైకేలోవు:- ఉపసంహరించుకో. పావేలూ! ఒక్క క్షణంకూడా వ్యర్థం చెయ్య వలసిన సమయం కాదిది. ఇంకా ఆలస్యం చేస్తే, వెంటనే నిన్ను అరెస్టు చెయ్యవలసి వస్తుంది.

[రాయస్కీ టోపీ తీసుకొని ద్వారం కేసి నడుస్తాడు.]

చలిగా వుంది; కోటు తొడుక్కుపో.

[రాయస్కీ పొట్టి కోటు తొడుక్కుని వెడతాడు.]

ఓల్గా:- మైకేలోవ్! మాట.

మైకేలోవ్:- వింటున్నా.

ఓల్గా:- ఇక్కడ ఈలా జరిగిందని వినగానే సంతోషం కలిగిందా? ఆనందోద్రేకంచేత నీగుండెలు ఆగిపోలేదు?

మైకేలోవ్:- నేను చాలా కంగారుపడి పరుగెత్తుకు వచ్చేను. చాలా గందరగోళం జరుగుతూందని భయపడ్డాను.

ఓల్గా:- నాప్రశ్నకి సరిగ్గా సమాధానం చెప్పు. ఆవార్త విన్నప్పుడు నీకు ఆనందం కలగలేదు?

మైకేలోవ్:- చాలా చిత్రంగా వుండే. సంతోషం ఎందుకు?

ఓల్గా:- ఎందుకా? మళ్ళీ ఇంకోమారు పావేల్‌ని అవమాన పరచవచ్చు. నీ కంటె తెలివైన వాడు కనక, - నీకంటె వెయ్యిరెట్లు అందమైన వాడు కనక అతనిమీద అసూయ తీర్చుకోన డానికి మళ్ళీ ఇంకో కారణం దొరికిందని-

మైకేలోవ్:- ఓల్గా! ఎంత అవమానకరంగా మాట్లాడుతూన్నావో తెలుసునా? ఈసభ్య ఎంత నీచమైన విషయాలు నామీద ఆరోపిస్తూన్నావో.

ఓల్గా:- నాకోసమని నువ్వు అతనిమీద పగ తీర్చుకుంటున్నావు. వింటూన్నావా? నేచెబుతూన్నది వేషంలోవున్న నీకు కాదు. నిజమైన మైకేలోవ్‌కి - నీ ఆత్మకి చెబుతూన్నా. నాకోసం అతని మీద పగ తీర్చుకుంటున్నావు. అందుకోసమే నువ్వు ఇక్కడికి వచ్చేవు.

మైకేలోవు:- ఎంత నీచం! ఓల్గా! ఇప్పటి జరిగిన పరిస్థితుల్ని సరిగా అర్థం చేసుకోకపోతే -ఇద్దరు ప్రత్యర్థుల మధ్య జరుగుతూ వున్న పోరాటంమాత్రమే నని అర్థం లాగేటట్లయితే- మనం మాట్లాడుకోవలసిన పనే కనపడదు.

ఓల్గా:- అదుగో జిల్లాపార్టీ కార్యదర్శి మాట. మళ్ళీ మైకేలోవు దాంకున్నాడా?

మైకేలోవు:- మైకేలోవులు ఇద్దరు లేరు, వోల్గా! ఆ తెలివితక్కువతనం వొద్దులు. ఉన్నదల్లా ఒక్కడే మనిషి.

ఓల్గా:- ఆ వున్న వొక్కడూ పార్టీ కార్యదర్శి.

మైకేలోవు:- ఔను. అతడే జిల్లాకమిటీకార్యదర్శి.

ఓల్గా:- కాని, మైకేలోవ్! నువ్వు ఓడిపోయేవు. నన్ను అతనిమీదికి ఎదురు తిప్పాదామని చూసేవు. బలవంతంగా నీకేసి తిప్పుకుందామని చూసేవు. కాని, ఫలితం మాత్రం శూన్యం. నువ్వు ఎప్పటికీ- వింటున్నావూ?- ఎప్పటికీ, నాకు పరాయివాడివే. నే నతని దగ్గరికే పోతా. నీ చేత అవమానించబడి, వేటాడబడుతూన్న ఆ నిజమయిన మనిషి దగ్గరకే పోతాను. నేను ప్రేమిస్తూన్న అతని దగ్గరికే పోతాను. (తొందరగా కోటు తొడుక్కుంటుంది.)

మైకేలోవు:- నిజానికి నేను నిన్ను అర్థం చేసుకోలేదు. ఈతడు కూడా తప్పు... కాని, ఆగు. ఒక్క క్షణం. క్లబ్బుకి నేనూ వస్తున్నా... వీలు చిక్కినంతమంది రైతుల్ని పోగుచేయమని

లోక్టేవుతో చెప్పేను.

ఓల్గా:- నేను నీతో రాను.

వెడుతుంది.

మైకేలోవు:- ఎవరికి తోచినట్లు వాళ్ళుంటారు....(నిశ్శబ్దం. మైకేలోవు నెమ్మదిగా తన సామాను తీసుకుంటాడు.) కామేస్రిడ్ మైకేలోవు! రెండే ప్రశ్నలు! ఊం. నీకూ ఆమెకూ, సరిపడే సామాన్యలక్షణాలు ఏమన్నా వున్నాయా? ఉహుం. లేవు... అయితే ఇంతకాలం ఈ విషయం గమనించకుండా ఏలాగ వుండగలిగేవు?... బాగుంది. ఏలాగో తటస్థపడింది....సరే. ... జరిగిన దేదో జరిగింది... ఈ కొత్తవాని విషయంలో నీ భావం ఏలాగవుంది! ... నీవు ఇంకా ఆమెని ప్రేమించగలుగుతావా? ... ఔను. ఔను. ... నువ్వు! ... వేరొక ధ్వనితో) సరే! నేను పోవాలి. ... వారంతా ఈ సాటికి వచ్చి వుంటారు. ... కాని, సమాధానం చెప్పి మరీ కదులు. ...ఓ! బాగుంది. ... పోతా!

వెళ్ళిపోతాడు.

మోక్రీనా:- (లోనికి వచ్చి, పరిశీలనగా చూస్తుంది.) అందరూ పోయేరు.

క్వాసోవు:- (లోపలికి వచ్చి) ఊః. (కూర్చుంటాడు) అబ్బ! గుండెలు ఏలాగ కొట్టుకుంటున్నాయో! నా వృత్త్యువు సమీపించింది.

మో(క్రీనా:- దేవుడిని ధ్యానించు!

క్వాసోవు:- దేవుడికి మన గోల వినిపించడం లేదు.

మోక్రీనా:- విశ్వాసం-

క్వాసోవు:- -ఉంచాలనే వుంది. అమ్మ! నువ్వొకపని చేసిపెడ తావా? బండీపాకదగ్గరికి వెళ్ళి తలుపు నెమ్మదిగా తట్టు. వా రందరినీ ఇక్కడికి రమ్మను. నేను కనిపెట్టుకొని వుంటాను.

మోక్రీనా వెళుతుంది. క్వాసోవు మోకరిలపడి నెమ్మదిగా ధ్యానిస్తూంటాడు. కోటికిన్, (ప్రోషికిన్, జుబోవులనూ, వారి పిల్లల్నీ, మరొక ఇద్దరు రైతు ల్నీ వెంటపెట్టుకుని, మోక్రీనా వస్తుంది. దేవతావిగ్రి హాలముందు మోకరిలబడి, అంతా కూర్చుంటారు.

కోటికిన్:- ఇవాన్! మహా బాగుంది. అసలు విషయం ఏమిటీ! (క్వాసోవు మాట్లాడడు.) ఇవాన్! ఓ ఇవాన్! (క్వాసో ధ్యానంలో వుండి మాట్లాడడు.) ఇవాన్! దేవుడు ఎక్కడికీ పారిపోడు, లే. మనకి ఒక్క గంటకంటె వ్యవధి లేదు. మే మంతా వచ్చేము.

క్వాసోవు:- మీ కందరికీ వందనాలు. మైకేలోవు వచ్చేడు.

జుబోవు:- ని...జ...మే...!

గ్రిన్కిన్:- మళ్ళీ?

కోటికిన్:- వాడు మహా జిత్తులవారి వాడు. మనిషిలో మంచి

దనం అసలు లేదు. ఏదో సర్దుకుపోయేరకం కాదు. విూటింగులో మగల సందర్నీ బుట్టలో వేసేడు. ఇప్పుడు మళ్ళీ తయారయ్యేడు.

పొప్రిష్కిన్:- మైకేలోవు ఇంకా పొప్రిష్కిన్‌ను మరచిపుండడు. పొప్రిష్కిను అతడిని మరచిపోలేదు.

కోటికిన్:- ఇద్దరూ ఒకచోట జీవించియుండగలరా?

క్వాసోవు:- వాడిద్దరి నడుమా పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటూంది. ఒకడు అంతకంతకి పేట్రేగి పోతూంటే రెండోవాడు ఏదో విధంగా ఒరగేసుకు పోతున్నాడు.

కోటికిన్:- వాళ్ళని ఒక్క బాకుపోటుతో కడతేర్చలేమూ? ఆ సంగతి ఎన్నడయినా ఆలోచించేవా?

క్వాసోవు:- ఇప్పుడు కత్తులు నూరుకుందుకు ఖాళీ లేదు. ఉంటే గండ్రగొడ్డలి తియ్యాలి. వాసిలీ! ఎలుగుబంటిలా ఎదుర్కోవలసినసమయంలో నక్కలా దాగుతానంటావేం?

కోటికిన్:- ఎలుగుబంటి ఛాతీ వెడల్పు. తుపాకీగురికి చులకనగా దొరికిపోతుంది.

క్వాసోవు:- దుంగల వెనక దాగు. వేటగాని బాటకి అడ్డంగా దుంగలు పడతాయ్యి. ఆఖరుకి వుడతలు కూడా తెగబడేలా అడివిజంతువు లన్నింటినీ రెచ్చగొట్టు. అడవి విశాలంగా వుంది. వేటగాళ్ళు ఎందరో వుండరు.

కోటికిన్:- అడవిజంతువులలో సామర్థ్యం వుంటే, చెయ్యొచ్చు.

కాని, తోడేలుకీ కుందేలుకీ సామరస్యం కుదురుతుందా?

క్వాసోవు:- కుందేలుని రెచ్చగొట్టి, ఇతరజంతువులతో కలిసేలా చెయ్యాలి. (కండక్టర్‌తో) మనం ఇక్కడ రహస్యంగా సమావేశం అయ్యేము. మన గ్రామంలో మన యింట్లోనే రహస్యంగా దాగివుండ వలసివచ్చింది. ఏమీ సంబంధంలేని పరాయి వాళ్ళ మాదిరిగా నడుచుకోవలసి వచ్చింది. అసలు మనం ఎలాంటి వాళ్ళం? అన్నిటికీ మనమే ఆధారం. రష్యామాతని పోషించుతూన్నది మనమే. మాస్కో- ప్రజలకి బట్టలు తయారు చేసియిచ్చేది మనం; వారికి కాలిజోళ్ళు చేసియిచ్చేది మనం; పోషించేది మనం. కాని, మన మీద అధికారం సాగించేది ఎవరో తెలుసా? చింకిరిగుడ్డలజోగులు, ముష్టివెధవలు, త్రాగుబోతులు! మాస్కోలో వుంటూన్న దెవరు! వారికి ఏ చీకు చింతలూ లేవు. ఈ రష్యా అంతా వారికి ఓ పరిశోధనాగారం అయిపోయింది. దానిలో ఒక రకం ఓషధిని యూరపు నుంచి దిగుమతి చేసి, నాటడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఆ కాలంలో మనం కలుపు మొక్కలమాదిరిగా కనబడుతున్నాం. మనల్ని తొలగించాలని వారి యత్నం; వేళ్ళకంటా పీకెయ్యాలని వూహ. మన కిప్పుడు రెండే పద్ధతులు మిగిలినాయి. ఒకటి వారేం చేసినా నోరుమూసుకొని పడివుండి, నశించి పోవడం. లేదా, యూరోపంతా దద్దరిల్లిపోయేలాగ "ఓ మాస్కో పండితులారా! నేము ఆలాగ లొంగిపోవడా

నికి గడ్డిముక్కలం కాము. ఇవి మగ్గిచెల్లుసుమా" అని ఎలుగెత్తి చెప్ప నయినా చెప్పాలి. (బల్ల గుద్దుతాడు. నిశ్శబ్దం. ఇంకా స్పష్టంగా) మేము మీ కత్తులు విరిచివేస్తాం. సామ్యం చెప్పిన తరవాయిగా మందు తయారయింది. నిప్పు గీయడం ఒక్కటే తరవాయి. ఆ పని మనం కానిద్దాం.

జుబోవు:- భేష్!

షిలోవు:- ఇది సమయం కాదేమో.

గ్రిన్‌కిన్:- పొరపాటు. ఇదే మంచి సమయం. ఆ జాబు చాల విలువ గలదని, ఎరిగిచెప్పకపోయినా వహామంచి మాటన్నాడు, రాయస్కీ. కాని, ఉన్నదేమిటంటే ఆ ఖరీదు నిచ్చుకొనే దెవరు? అనేది వొక్కటే.

పోర్షిన్:- మైకేలోవు ఈవ్రాసు విడువడు. వాడికి ఈవ్రాసి నీరు పడింది.

క్లాసోవు:- (కోటికిన్‌తో) నీ అభిప్రాయం ఏమిటి!

కోటికిన్:- నేనేమీ వెనకతియ్యను. కాని, మనం కొంచెం ఆలోచనతో అడుగు వెయ్యాలి. అన్నింటికంటేనూ ముఖ్యమయిన విషయం సీసా. ఒక్కొక్కప్పుడు అది అద్భుతంగా పనిచేయగలదు. లక్షాధికారిని భిక్షాధికారినీ, భిక్షాధికారిని లక్షాధికారినీ చేయగలదు. కనక మనం గ్రామంలో ఒక విందు చెయ్యడం మంచిది.

గ్రిన్‌కిన్:- ఆ పని చేయవలసిందే. ని...జం.

కోటికిన్:— దేవుడి దయకూడా వుండాలనే విషయం మరచిపో కూడదు. దేవుడు తమ పక్షాన వున్నాడంటే వారికీ ఎంతో వుత్సాహం. కాని, మనం ఆపని చాలా చమత్కారంగా నడిపించాలి. రేపు పండగరోజు. ఆదివారంనాటికంటేనూ రేపు దేవాలయంలో చాలా జనం సమావేశం అవుతారు. 'సాహసికారం'కోసం ఒకసమయం ప్రకటించమని ఫాదరుతో చెప్దాం. మన వాళ్ళు, నిజంగా చేసిన వెధవపనులన్నీ దాచి, ఏనాడూ చెయ్యని తప్పు లొప్పుకొనే సమయంలో ఫాదరునోట — నువ్వు అలాగ చెయ్యి, ఈలాగ చెయ్యి, అనిపించినామా వొదిలిపోతుంది. అప్పుడు దేవుని ఆశీర్వచనంతో మన పని ఆరంభించవచ్చు.

క్వాసోవు:- రేపటికి సమయం మించి పోతుంది. ఈవేళనే, ఈ క్షణంలోనే మనం పని ఆరంభించాలి.

జుబోవు:- ఇప్పుడే యెల్లాగ?

గ్రిన్కిన్:- ఇపుడే ననడంలో నీ అభిప్రాయం ఏమిటి?

షలోవు:- నాకు భయంగా వుంది సుమీ!

కోటికిన్ :— ఇవాళా! ఏమిటా హడావిడి!

క్వాసోవు:— మనమహావీరుని ఆజ్ఞలు రద్దుపరచడానికి సైకేలోవు వచ్చేడు. ఈ వేళనే ఐతే పల్లెల కీమాట చెప్పడానికి ఖాళీ వుండదు. రేపటి కంటే ఊరందరికీ ఉప్పందిపోతుంది. మనమాట వినేవా రొక్కడూ వుండడు. ఇదే తగినసమయం.

ప్రొష్కిన్:- (పగతో) మైకేలోవు నా వంతు.

క్వాసోవు:- వాడి ఆత్మశాంతికోసం ప్రార్థించుదాం. రాండి.

(క్రాసు వేస్తాడు. నిశ్శబ్దం.)

జాబోవు;- అయితే గాయస్కీ ఆత్మకో!

క్వాసోవు:- వాడిని ముట్టబోకండి. మైకేలోవు చచ్చిపోయేదంటే మనమహావీరుడు వలసినంత అపకారం తెచ్చిపెట్టుకోగలడు. మన వూరొక్కటే కాదు. జిల్లా అంతా ఒక్క మాటమీద తిరగబడి వూరుకుంటుంది...

జాబోవు:- మైకేలోవు కోరికో యింటనున్నాడా?

క్వాసోవు:- ఔను. రైతుల్ని పోగుచేసుకొని దమ్మారి మనవారిని పంపించుదాం. గ్రామంలో వున్న ఆయుధాలన్నీ జాగ్రత్త పెట్టించాలి. కోటికిన్ తేనెటీగల దొడ్డిలో కలుసుకుందాం.

కోటికిన్:- బాగా నమ్మకమైన వాళ్ళని వెంటనే పిలవండి.

క్వాసోవు:- కుర్రవాళ్ళని దీసుకురాండి. పొండి. మీకు దేవుడే సాయం చేస్తాడు.

షిలోవు:- ఒక్క నిముషం...

ప్రెన్కిన్:- వాస్యా! ఏమిటది?

షిలోవు:- ఒక్క నిముషం ఆగండి...ఇవానా! ... ఏమిటి చెయ్యాలని నీ వూహా?...నాకేమీ తెలియడం లేదు.

వాసిలీ:- నీకు తెలియని దేమిటి?

షిలోవు:- మనం ఎందుకు పోరాడుతూంటు? ఆ కాగితంకోసమే?

దానికోసం మరో రెండువేల పూడులు వసూలు చేయడం మంచిది కాదనేకాదూ! — కాని, ఇప్పుడు... మైకేలోవు వాటిని తీసుకో... అతనికి అది తప్పని తోచింది. కాని, మనం! (అభినయిస్తాడు.) ఎందుకూ? ఇవాన్! అతడు మన పక్షమే కాదూ?

గ్రిన్‌కిన్:- నే చెప్తా. నాతో రా. ఒకగ్లాసెడు పుచ్చుకున్న మీదట నీకే తెలుస్తుంది.

షిలోవు:- కాదు. ఉండు. ఉండు.

క్ర్యాసోవు:- వాసిలీ! కబుర్లు పెట్టుకు కూర్చుందుకు సమయం కాదు. సరాసరి పనిలోకి దిగాలి. మీరంతా ఇక్కడే వుండి పోయేరేం! మన మంతా ఒక్క చోటనుండగా ఎవ్వరూ చూడకూడదు. మన గ్రామంలో మనమే మొగం చూపలేని స్థితికి వచ్చేము. ఎంత దౌర్భాగ్యం!

ఒకరి తరవాత నొకరు వెడతారు.

మోక్రీనా:- ఈ గందరగోళాని కంతకీ కారణం ఆ కోల్కాయే. వాడూ ఒక అమ్మ కొడుకే నని వూరుకున్నా గాని, యీ సరికే గొంతు మలిపెయ్యక పోయానా?

క్ర్యాసోవు:- కోల్కా వున్నాడే వాడు గుర్రం కాలిలో నాడం లాంటివాడు. మనం అసలు గుర్రాన్నే చంపెయ్యాలి.

షిలోవు:- ఇవానూ! ఆ గుర్రం ఎవరిది?

క్ర్యాసోవు:- వాసిలీ! వెళ్ళి రా.

గ్రన్‌కిన్ షీగోవుని నడిపించుకు పోతాడు. వా
ళ్ళని పంపించి, క్వాసోవు తలుపులు వేసుకుంటాడు.
ఒక గండ్రగొడ్డలి తీసుకొని, మోకాళ్ళమీద వొంగి
బల్ల ఎత్తి, దానిక్రింది నుంచి ఒక రైఫిలూ, రివా
ల్వరూ, తీసుకుంటాడు.

క్వాసోవు:- మనస్సులో ఎల్లాగో వుంది. ఏమయినా చెప్పవూ.

మోక్రినా:- (శిరం ఎత్తినట్లుగా) ఇవానూ! నీకేమిటి చెప్పను!
రాత్రి నాకు కనపడిన విషయం నీకూ చెబుతా. విను. నిన్న
సాయంకాలం నా మనస్సు ఏలాగో వుంది. చాలా సేపు వర
కూ నిద్ర పట్టలేదు. తోటలలో కుక్కలు అరుస్తున్నాయి.
పొయ్యి వెనకాల చిమ్మట ఒకటి 'కీ-ఈ' మంటూంది.
అటు తరవాత నిద్ర ఎప్పుడు వచ్చిందో తెలియదు. కీచు
రాయి గోల వినిపించడం లేదు. దానికి బదులు సన్నని తీగల
మీద- నక్షత్ర కాంతి రేఖలతో తయారుచేసిన తీగలమీద-
మానవమాత్రు డెన్నడూ చూచి వుండనంత సుందరమయిన
తీగలమీద- పాడుతూన్న దేవదూతల గానం వినిపించసాగిం
ది. ఆ దేవదూతలు తమ చిన్ని వేళ్ళతో ఆ తీగల్ని అంటీ
అంటనట్లు తాకుతూన్నారు. నా కళ్ళ యెదుట నిండుగా
పూచిన ఉద్యానవనం కనబడింది. జలధారలు పొంగుతూ,
మిలమిలలాడుతున్నాయి. నిష్కల్మషమయిన చెరువులలో

పడవలు తేలియాడుతున్నాయి. అక్కడి పువ్వులు బాగా యెత్తున వుండి, స్వర్గంలో తేలియాడుతూన్నట్లు కనపడుతూ న్నాయి. పరిమళపూరితమయిన గాలి తగిలేటంతకి ప్రాణం లేచివచ్చింది. హఠాత్తుగా నా కంటిముందు ఒక టేబిలు కన బడింది. దాని మీద సాలీపురుగు దారాలతో నేయబడిన బట్ట పరవబడివుంది. దాని పక్క ఒక వేపు దేదీప్యమానంగా దేవదేవుడు కూర్చుని వున్నాడు ఆ ప్రక్క ఒక సింహాసనం మీద మన ప్రభువు కూర్చుని వున్నాడు. నే నాయనకేసి తల యెత్తి చూడలేకపోయేను. నిలువునా కుప్పకూలిపోయే ను. అప్పుడు ప్రభువు నన్ను పిలిచి తలయెత్తి చూడమ న్నాడు. ప్రభువు ముందర మన 'చిన్న జారు' కూర్చుని వున్నాడు. ఆయన స్వచ్ఛమైన దుస్తులు ధరించేడు. ముత్యా లతో వాటిమీద లతలు కుట్టబడివున్నాయి. ఆయన తల మీదినుంచి ఒకవిధమయిన తేజస్సు ఎగచిమ్ముతూంది. ఆయ నను చూసి 'ఓ మహాప్రభూ! క్రీస్తువవ్యతిరేక ప్రభుత్వా న్నింకా ఎంత కాలం సాగనిస్తావు? నీ ప్రజలదగ్గరికి మరల యెప్పుడొస్తావు?' అని అడిగేను. జారుప్రభువు సింహాసన ము దిగి చేయిజాపినాడు. నేను...

పాషా గుమ్మంలోకి వచ్చి గోడకి జేరబడి క్వా సోఫ్ వ కతేరిపాన చూస్తుంది. మోట్రీనా ఆ మెవంక నిశ్శబ్దంగా చూస్తూ నిలబడుతుంది.

క్వాసోవు:- (వెనక్కి తిరిగి చూడకుండానే) అప్పుడు నువ్వు ఏం చేసేవు? (నిశ్శబ్దం) నీ వేం చేసేవు? (తుపాకీ చేతులో వుండగానే వెనకతిరిగి చూస్తాడు.) ఓ!. నా చిట్టి తల్లీ! క్లబ్బుకి పోతానంటూ నువ్వు చేసిన దిదా?

పాషా:- అక్కడికంటె ఎక్కువ ఆనందకరమయిన ప్రదర్శనం ఇక్కడ నా కంటపడింది.

క్వాసోవు:- నువ్వు తలుపుకి తాళం వేయలేదు టమ్మా!

పాషా:- తాళం వేసే వుంది. కాని, ఆ రైతుతో చీకటిచాటున లోపలికి వచ్చేను.

క్వాసోవు:- ఇక్కడ ఏముందని వచ్చేవు?

పాషా:- (రైఫిలు కేసి తల ఎగరవేసి) నువ్వ నుకుంటూన్న దాని కంటె ఎక్కువే చూసేను.

క్వాసోవు:- నీ తండ్రిమీద వేగులదానివా?

పాషా:- ఏదో సరదా. నాకు అన్ని సంగతులూ తెలుసుకోడం ఓ సరదా.

క్వాసోవు:- (బెదిరిస్తూన్నట్లు) పాషా!

పాషా:- ఆ పేరు నువ్వు పెట్టినదే!

క్వాసోవు:- కోపం జ్ఞానాన్ని లోపింపచేస్తుంది. ఒక్కొక్కప్పుడు నువ్వు నా కూతురు వనేది కూడా మరవవచ్చును.

పాషా:- నువ్వు మరవడమే తటస్థించితే శతసహస్ర వందనాలు.

క్వాసోవు:- కుక్కా!

పాషా:- నీక్రడి మొదట వున్నావు!

క్వాసోవు:- నన్ను చంపుతా.

పాషా:- మైకేలోవులో తృప్తి లేదన్నమాట.

క్వాసోవు:- ఆ...హా! విన్నావా!

పాషా:- నాకేం చెవులు లేకపోలేదు.

క్వాసోవు:- పాషా! ఐతే ఇప్పుడేం చేస్తావు?

పాషా:- ఆ పని జరగనియ్యను! ఆ దారుణకృత్యం జరగకుండా ఆపుతాను. జరిగిన దంతా బయటపెడతా.

క్వాసోవు:- నీ తండ్రిని చంపించేస్తావా?

పాషా:- నీ సంకల్పం విడిచి పెట్టుమరి!

క్వాసోవు:- నన్ను మహా బాధ పెడుతూన్నావు.

పాషా:- నువ్వు నన్ను బాధించడం లేదూ! గోరీలో పెట్టినట్లు నన్నీ వేధనకొంపలో అణచివెయ్యలేదు?

క్వాసోవు:- పేచీలు తప్పుకోడాని కిదా సమయం?

పాషా:- ఏం? తొందరపడుతూన్నావు? అతనిని చంపడానికి నీకు ఖాళీ యిస్తాననే? వెడతా. (బయలుదేరుతుంది.)

క్వాసోవు:- ఎక్క, డికి? ... పాషా! ఒక్కనిముషం ఆగు!... పాషా!

పాషా:- బాధ పెడుతూ నేనెందు కిక్కడ?

క్వాసోవు: పాషా! నా మాట విను. నా ప్రాణాలు తియ్యడాని కంత తొందర యెందుకు? కష్టపడి, చెమటోడ్చి, ఈ భూము

లన్నీ దున్నుతూంటు నీ కోసమే కాదూ!

పాషా:- ఆ పని చెయ్యమని నేనేం బతిమాలలేదు. (ద్వారం కేసి నడుస్తుంది.)

క్వాసోవు:- ఒక్క మాట విని పో. ఒక్క- మాట!

పాషా:- చెప్పు.

క్వాసోవు:- నువ్వు పెడుతూన్నది ఎవరి కోసం? వాళ్ళు మనల్ని మనుష్యులుగా నైనా చూస్తున్నారా? వాళ్ళ కంటికి మనం పురుగుల కంటేనూ అధమంగా కనబడుతున్నాం. ఉదాహరణకి చూడు! వాళ్ళు నిన్ను ఎందుకు హేళన చెయ్యడం?

పాషా:- నన్నా! ఎవరా హేళన చేసేది?

క్వాసోవు:- మీ మహాశయుడు. ఆ పతకం ధరించేసూ, వాడూ ఆ తెల్లతోలు తొత్తా కలిసి.

పాషా:- ఏమని హేళన చేసేరో చెప్పు!

క్వాసోవు:- తన ముందు దగ్గరనే నిన్ను వేళాకోళం చేసేడు. 'ఎంత పల్లెటూరి గబ్బిలాయి! లావుగా ఉప్పిడి ముక్కూ- అదీ నా కోసం దేవులాడుతూంది. నేనేదో తనని మనతో నగరానికి తీసుకుపోతా ననే అనుకుంటూంది...'

పాషా:- (రెండు చేతులూ గుండెల కదుముకొని, కళ్ళు తిప్పుతూ) అసత్యం!

క్వాసోవు:- ఆ లంజ నవ్వింది. "తీసుకురా, పోనీ వంటకయినా ఉపయోగిస్తుంది."- అంది ఆవిడ.

పాషా:- (కన్నీటితో) వంటకా?

క్యాపోవు:- దానికి వాడేమన్నాడో తెలుసా?..."మూర్ఖుగాని, కాదూ. నేను చెయ్యమంటే అది వంటకి కూడా సిద్ధపడుతుంది."

పాషా:- (కంట నీరు పెట్టి) అసత్యం! ఎప్పుడూ అనడు. నన్ను ఆ విధంగా చేయడు.

క్యాపోవు:- (తల వొంచి) దేవుడి తోడు!...అమ్మ తోడు!...

పాషా:- నోరు ముయ్యి! నోరుముయ్యి! నన్ను ఆలోచించనీ! దాని ముందర నన్ను హేళన చేసేడా!

క్యాపోవు:- దాని ముందరే నమ్మా!

పాషా:- నోరుముయ్యి! నోరెత్తకు! పావేల్! ఆఖరికి నువ్వూ అందరిలాంటి వాడివేనా? ఇంకా నీ కోసం నే పాకులాడుతున్నానా? నేను! ఓ ముద్దూ! పాషా! ఓ పేదబొమ్మా! (ఏడుస్తుంది.)

మాక్సినా:- ఏడు! ఏడ్వడంవల్ల హృదయ భారం కొంత తగ్గుతుంది.

పాషా:- ష్! ఇంక నవ్వా మొదలు? నేనేమీ ఏడవడం లేదు. నాన్నా! నిప్పు ముట్టించు!... కానీ!... జ్వాలల వేడి వాళ్ళకి తెలిసిరావాలి. ఒక్కడూ తిరిగి ఈ ప్రాంతాలు తొక్కి చూడకూడదు. ఇక్కడికీ, నగరానికీ, మధ్యగల ప్రదేశమంతా దగ్ధపటలం కావాలి. వాళ్ళని జ్వాలలతో ముట్టడించాలి. కొంపలు కాలి, కిటికీ తలుపులు పగిలిపోతోంటే, చూసి

ఆనందించుదాం. వాళ్ళవి ఎంతెంత భవంతులయినా మనం తగలబెట్టివేయగలం! ఇవి మహావృక్షాలు. కాదూ?

క్వాసోవు:- అమ్మాయీ! మనం ఉభయులం కలిసే ఆ పని చెయ్యొచ్చు! (పాషా ఆవేగంతో ఒక తుండుగుడ్డ తలకి చుట్టుకొని, కోటు తొడుక్కుంటుంది.) ఎక్కడికి వెళుతున్నావు, నవ్వా.

పాషా:- అనుమానించనక్కర లేదు. తేనె టీగలవాడ్డి దగ్గరికి వెళుతున్నా.

వెళుతుంది.

మోక్రీనా ఆమెని పంపి తలుపు వెయ్యడానికి వెళుతుంది. క్వాసోవు నెమ్మదిగా మోకరిలబడతాడు.

క్వాసోవు:- దేవదేవీ! ఆపద్బాంధవీ! నా కూతురుతో అసత్యాలు చెప్పేనని కోపగించకు. క్షమించు.

[తెర.]

# ఐదో అంకం.

## ఎనిమిదో రంగం.

ఒక రైతు యింటిలో వొక గది. అందులోనే సమిష్టిగ్రంథాలయం వుంది. అచ్చటి బెంచీ లన్నీ ఒక మూలకి చేర్చబడివున్నాయి. జొటోవా, రోమనోవు, మిషా— అఫనాసీవు, ఇతర కమ్యూనిస్టు యువకులు-యువతులు, ఆ గదినిండా వున్నారు. అందరూ చుట్టలు కాలుస్తున్నారు.

రోమనోవు:- జొటోవా!

జొటోవా:- ఏం?

రోమనోవు:— పహరా మార్చే వేళ కాలేదూ?

జొటోవా:— ఇప్పుడే కాదూ పంపించేము?

రోమనోవు:— అబ్బ! నా కేమీ పని కనబడడం లేదు.

అఫనాసీవు:- అయితే ఇదుగో చూడు. ఈ మేకు వూడిపోయింది. నీ తలకాయతో దీనిని గోడలో దిగేసిపెట్టు.

పెద్దనవ్వు. ఇద్దరు రైతులు వస్తారు. ఒకని చేతిలో తుపాకి, మరొకని చేతిలో ములుగర్ర వున్నాయి.

మొదటి రైతు:- నమస్కారాలు. పోయి, హాత మూర్చడం ఆరం భించుదామా?

రెండో వాడు:- కోపం చేత వీడికి దేహం తెలియడం లేదు.

రోమనోవు:- అల్లరి చేయకుండా కూర్చోండి.

మొదటి క. యువకుడు:- ఇంకా రాయస్కీ రాడేం!

జొటోవా:- సమయానికిఆతడే వస్తాడు. మళ్ళీ ఈలోగా మీరు బయటికి ఎక్కడికీ పోకండి.

మొదటి క. యువకుడు:- బయటికి వెళ్ళడం లేదు.

రోమనోవు:- ఇక్కడ మాత్రం ఆ పని చెయ్యకండి.

నవ్వు. ఒక దుడ్డుకర్రతో సోటిన్నూ, ఆతనితో మరో కుర్రాడూ, వస్తారు.

సోటిన్:- కామ్రేడ్! జొటోవా! నమస్కారం. పోలిష్కన్ని నా వంతుకి వదిలెయ్యి. నే నాతని రైతును. ఈ బొప్పపుల్ల ఆతని దగ్గరనుంచి తెచ్చినదే. (దుడ్డుకర్ర తిప్పుతాడు.)

రెండో క. యువకుడు:- నీకు తోచినట్లల్లా తిప్పకు. చస్తాం.

నవ్వుతారు.

సోటిన్:- ఎవరిని కొట్టాలో దానికి నేర్పేను. ఫరవాలేదు.

దుడ్డుకర్ర అడ్డంగా తిప్పుతాడు. కొందరు భయం తో అరుస్తారు. నవ్వు.

రోమనోవు:- సేనాధిపతి యింకా రాడేం!

మైకేలోవ్, కోరికో, ఓల్గాలు వస్తారు.

మైకేలోవు:- దూరంగా వుండండి. ఏమిటిది?

జొటోవా:- మైకేలోవు! ఆశ్చర్యం! ఊరికి పోలేదూ?

మైకేలోవు:- మిమ్మల్ని-ముఖ్యంగా నిన్ను-. విడిచిపోగలనా? బండీ గడుగొయ్యలతో ఏం చెయ్యాలని?

సోటిను:- దీనితో యుద్ధం చేస్తాను.

మైకేలోవు:- ఎవరితోటి?

సోటిన్:- మనల్ని ఎదిరించిన వాళ్ళతో.

మైకేలోవు:- మీరూనా?

ధ్వనులు: - (ఒకేమారు) మేమూను!

మైకేలోవు:- మీ మీ యిళ్ళకి పోండి. మరో గంటకి అల్లరన్న మాట ఉండదు. కామ్రేడ్ రాయస్కీ తన ఆజ్ఞ రద్దు చేసుకున్నాడు.

రోమనోవు:- రద్దుచేసుకున్నాడూ?

జొటోవా:- నాతో ఏమీ చెప్పలేదే!

అఫనాశీవు:- అది తెలివయిన వాడి లక్షణం!

మైకేలోవు:- (చుట్టూ చూసి) ఇక్కడ రైతు లెవ్వరూ కనబడరేం? (రోమనోవుతో) వీరంతా మీ పటాలం జనమా?

రోమనోవు:- ఔను. మా పటాలమే.

మైకేలోవు:- వీరంతా కమ్యూనిస్టు యువకులా!

జొటోవా:- ఔను!

మైకేలోవు:- ఇక్కడ ఇంకెవ్వరూ లేరూ? పైగా అందరినీ ఇక్కడికి పిలుచుకు రమ్మన్నానే! రాక పోవడానికి కారణం ఏమిటో తెలియకుండా వుందే!

జొటోవా:- లోప్ట్రేవు ఇంటింటికీ పరిగెత్తుతున్నాడు!

మైకేలోవు:- అయితే యింకా ఎవ్వరూ రాలేదేం? ఏం జరిగిందంటావు? (ఓల్గాతో) ఏమి అంటావు?

ఓల్గా:- ఏదో గందరగోళం జరుగుతూ వుండివుంటుంది.

మైకేలోవు:- (ఒక కమ్యూనిస్టు యువకుడితో) వెళ్ళి డైకోవుని పిలుచుకు రా. (వాడు పరిగెత్తుతాడు.) ఏమీ బాగా లేదు! ...బాగా లేదు. ...ఇగ్నట్ వాసిలీవిచ్! ఏం జరుగుతూ వుందంటావు?

కోరక్కో:- డిమిట్రీ! రైతులకి చాలా కోపం వచ్చింది. రైతుల సంగతి నీకు తెలియదు. ఆతనితో సరిగా వ్యవహరించేవా, మొదట కొంచెం మొగం చాటుచేసుకున్నా ఆఖరుకి చెప్పి, నదంతా చేస్తాడు. కాని, వ్యవహారం సరిగా లేకుంటేమాత్రం నానాభీభత్సం చేస్తాడు.

ఓల్గా:- నేనూ అంతే. —నీ సంగతి నాకు తెలిసివుండక పోతే —నిజం చెప్పవద్దూ, ఇక్కడికి వచ్చియుండ పోదును. జాక్ బతికివున్న రోజులలో అయితే నేను ఆ పన్నే పనిచేసి వుండేవాడిని. కాని, ఇప్పుడు... అబ్బే!

జొటోవా:- ఇది కేవలం విప్లవవ్యతిరేకంగా వుంది.

ఓల్గా:— నా కదేమీ తెలియదు. అయితే కావచ్చునేమో......
నువ్వనేదే న్యాయంలో చదువుకున్నావు. కాని, ఇది చూసే వూ, ఇది నా ప్రభుత్వం. నేను దానికోసం పోరాడేను. కనక అది నన్ను అణచివెయ్యడానికి అంగీకరించను. నువ్వు కుడిచేత పోరాడుతూంటే ఎడమచెయ్యి కంటిలో పొడుచుకోనా?

మైకేలోవు:— ఏవో చిన్న చిన్న తప్పులు జరక్కుండా, ఏ మహా కార్యాలు జరిగేయి? నీకీ విషయం చెప్పాలా?

ఓల్గా:— ఔను, నిజమే. ...మాకు తెలుసు. కాని, పరిమాణాలు మరీ ఎక్కువ అవుతూంటే! కనకనే రైతువాడు ఆత్మరక్షణకోసం రాయో—రప్పో జాగ్రత్త పెడుతూన్నాడు.

మైకేలోవు:— ఆ రాయి ఎవరిమీద విసురుదామని?

ఓల్గా:— అదే కిటుకు... ఆ సంగతి వాళ్ళకి తెలియదు. తెలిసే వుంటే ఈ పాటికే విసిరివుండును.

డ్రైడోవు, ఒక కమ్యూనిస్టుయువకుని వెంట
బెట్టుకొని వస్తాడు.

మైకేలోవు:— అందరికీ తెలియపరిచేవా?

డ్రైడోవు:— ఏమని?

మైకేలోవు:— ఆ యాజ్ఞ రద్దు చేసుకున్నా రని.

డ్రైడోవు:— ఆ విధంగా చెయ్యమని ఎవ్వరూ చెప్పలేదు.

మైకేలోవు:— ఏమిటీ? రాయస్కీ కనపడలేదూ?

డ్రైడోవు:— ఊహుం. నే నాతనిని చూడనేలేదు!

మైకేలోవు:- నిజం!

డైడోవు:- నిజమే!

మైకేలోవు:- అందుకా మీరీ ప్రయత్నాలు!

డైడోవు:- తప్పా?

మైకేలోవు:- నిన్నేమీ అనడం లేదు. రైతులు రాకపోవడానికి కారణం ఇది! కుర్రవాళ్ళూ! ఈలా వినండి. మీరు వెంటనే గ్రామంలోకి పోయి, ప్రతి తలుపూ పిలిచి, 'కామ్రేడ్ రాయస్కీ తన ఆజ్ఞనుపసంహరించుకున్నాడు. మైకేలోవు వచ్చేడు. రేపు లిస్టులన్నీ పరిశీలించి, సోవియటుమీటింగులో ధాన్యం ఎవరివద్ద వసూలు చెయ్యవలసిందీ నిశ్చయిస్తారు'— అని చెప్పి రండి పోవాలి. వేగం. ఇంక సమయం ఎంతో లేదు కూడాను....

లోక్టేవు:- (ఆయాసపడుతూ పరుగెత్తి వస్తాడు. మాటలు తడబడుతున్నాయి.) కులకులంతా మిస్కా క్వాసోవుని విడిపించేరు. చాలామంది పోగయ్యేరు. అంతా తెగతాగి వున్నారు. అందరికీ ఆయుధాలున్నాయి.

జోటోవా:- మనవాడొకడు కాపలా వుండాలే!

లోక్టేవు:- అతడిని చంపేసేరు.

మైకేలోవు:- డైడోవూ! మన పనేమీ పాగాలేదు.

డైడోవు:- (భయంతో) దొమ్మి! మొదటినుంచి గోలపెడుతూనే వున్నా. ఇప్పుడేమిటి చెయ్యడం?

మైకేలోవు:- ముందు నోరు మూసుకో. (సోటిన్‌తో) నువ్వు తుపాకీ కాల్చగలవా!

సోటిన్:- నేను అన్ని రంగాలలోనూ పనిచేసినవాడినే.

మైకేలోవు:- మాజరు తుపాకీ తీసుకుని ద్వారం కాయి. (అతనికి తుపాకీ యిస్తాడు. కోరిక్‌తో, ఓల్గాలతో) మిత్రులారా! చూసేరూ. మనమీద ఎంతభారం పడిందో. మీ ఉభయులూ చెరో కొందరినీ తీసుకొని. గ్రామంలోకి పోయి, కులకులు రైతుల్ని కూడగట్టుకోకుండా చెయ్యండి.

కోరిక్:- జనాన్ని ఏరు.

ఓల్గా:- ప్రజలు ఎన్ని దురంతాలు చేస్తారు!

మైకేలోవు:- జోటోవా! ఐదుగురు యువకుల్ని ఏరు.

రోమనోవు:- నాకో ముగ్గుర్ని ఇయ్యండి. కాపలాజనం విషయం చూసివస్తాను.

మైకేలోవు:- జోటోవా! జనాన్ని ఏరు.

జోటోవా:- (ఎంచుతుంది.) పెట్యా! నువ్వు వెళ్ళాలి. నువ్వు! నువ్వూను.

ఒక యువకుడు:- నాకు గ్రామంలోకి పోవాలని లేదు. ఇక్కడే నీతో వుంటా.

జోటోవా:- సరే! ...,నింకా! నువ్వు వెళ్ళు!

నింకా:- నేను రోమనోవుతో వెడతా.

జోటోవా:- సరే! ఆయనితోనే పో.

కోరకో:- డిమిట్రీ! ఆలస్యం అయిపోతూంది.

మైకేలోవు:- సరే! వెళ్ళి రాండి.

జట్లు క్రమబద్ధంగా నడిచి పోతాయి.

జొటోవా:- ఒకమారు అలారం గంట వాయిస్తే?

మైకేలోవు:- నేను నిన్ను వాయిస్తే!... లోక్టేవు! ఆయుధా లెక్కడ?

లోక్టేవు:- ఆయుధాలు ఆ గదిలో వున్నాయి. పార్టీ గదిలో.

మైకేలోవు:- ఏమూర్తిం వుంటాయి! (యువకులతో) మూగుతా రేం? కళ్ళు నా కేసి తిప్పండి. వరుసగా నిలబడండి.

లోక్టేవు:- మూడు బ్రెన్ను తుపాకులు, ఆరు ఒక్ పాటు తుపాకులు, ఒక మాంటెక్రిస్టు రైఫిలూను.

మైకేలోవు:- (అఫనాశీవుతో) నువ్వు ఈతనితో పోయి, అవన్నీ ఇక్కడికి తీసుకురా. ఆడపిల్లలూ! మీరు ఇవతలకి రాండి. పంక్తిలోంచి ఇవతలకి రండి.

మొదటి క. యువతి:- ఉహుఁ. మేమూ వీళ్ళతోటే వుంటాం.

రెండో క. యువతి:- మాకూ తుపాకులు కావాలి...

మొదటి క. యువతి:- మనకు...

మైకేలోవు:- ఊరుకోండి. జొటోవా! ఇదేనా మీ శిక్షణ?

జొటోవా:- మనుష్యుల్ని ఎందుకు అవమానించడం? ఈ మగవాళ్ళకంటె మా తక్కువేమిటీ? మేమూ వెడతాం.

మొదటి క. యువకుడు:- వాళ్ళనీ రానియ్యి. లేకుంటే ఇప్పుడే

సణుగుడు ఆరంభిస్తారు.

మైకేలోవ్:- ఆ సంగతి తరువాత చూసుకుందాంలే. తూటాలు అందరికీ ఈయండి.

[ఆడవాళ్ళు పక్కగదిలోకి వెళ్ళి మౌనంగుండు. తూటాలతో వున్న పిస్తోలు తీసుకువస్తారు. లోసేవ్, అగనాకోవ్రా, తుపాకీలు తెచ్చి బల్లమీద పెడతారు.]

సైడోవ్:- నగరంకి ఫోనుచేయాలి!... ఫోను!

మైకేలోవ్:- ఊ. వెళ్ళు. ఫోను చేయి.

సైడోవ్:- ఏలాగ వెళ్ళను. ఫోను సోవియటు మందిరంలో వుంది. వెడితే వాళ్ళు చంపేస్తారు.

మైకేలోవ్:- అయితే నోరుమూసుకుని కూర్చో. నీదగ్గర రివాల్వరు వుందా?

సైడోవ్:- వుంది.

మైకేలోవ్:- అది నా చేతికి ఈయి.

సైడోవ్:- నాకు రివాల్వరుకూడా లేకుండా చేసిపోతే ఏలాగ?

మైకేలోవ్:- నిన్ను పసుపుచుక్కలో దాస్తాములే. సరేనా? (ఆతడి రివాల్వరు తీసుకుంటాడు.) అబ్బాయిలూ! మీ తుపాకీలు తీసుకోండి. (కమ్యూనిస్టు యువకులు పల్లవైపు ఉరుకుతారు.) ఆగండి! ఏమిటూ పని? జోటోవా! మంచి బాగా దెబ్బలాట

గలవాళ్ళను పేరు.

జొటోవా:- వాంకా!- జెడ్డన్ తీసుకో. (అతడు పంక్తి విడిచి వచ్చి ఒక తుపాకీ తీసుకుంటాడు.) మిష్కా!- ఒక జెడ్డన్.

మిష్కా:- నాకో 'బక్ షాట్' గన్ ఇయ్యి.

జొటోవా:- చెప్పింది తీసుకో. 'జెడ్డన్' వెయ్యి గజాల వరకు పేలుతుంది.

లోక్తేవు:- వెయ్యి గజాలే!

జొటోవా:- నువ్వు అడ్డం రాకు. గ్రిష్కా!- ఒక బక్ షాట్. ఆండ్రీ!- జెడ్డన్. వాన్యూస!- ఒక బక్ షాట్.

లోక్తేవు:- (తూటాలు ఇస్తూ) గట్టిగా కట్టుకోండి. పై కాగితం నలగనియ్యకండి.

మైకేలోవు:- (లోక్తేవుతో) సొరాషొటుదారు ఇక్కడే కాపరం వుంటాడా? కోట్లు పక్కనేనా?

లోక్తేవు:- ఔను...

మైకేలోవు.- (అఫనాశీవుతో) ఆ షొటుదారుని పిలుచుకు రా. (మిష్కా వెడతాడు. లోక్తేవుతో నెమ్మదిగా) వాళ్ళు చాలా మంది వున్నారా?

లోక్తేవు:- చెప్పడం కష్టం...

మైకేలోవు:- ఈ విషయాన్ని గురించి రైతులు ఏమనుకుంటూన్నారు! నువ్వు ప్రతి యింటికీ వెళ్ళేవా!

లోక్తేవు:- వాళ్ళేమీ చెప్పలేదు.

మైకేలోవు:- ఏమీ అనలేదూ? ...... పరిస్థితులు ఏమీ బాగు లేవు. (భయపడుతూన్న పాటదారుని వెంటబెట్టుకొని మిస్తా వస్తాడు. రాత్రి దుస్తుల మీద ఒక కోటు వేసుకొని నిద్ర ముఖంతో వుంటాడు పాటదారుడు.)

నువ్వేనా సారా పాటదారుడివి?

ఏజంటు:- నాలుగేళ్ళనుంచి. ఇంతవరకూ ఒక్క మాట కూడా పడలేదు.

మైకేలోవు:- నిన్ననూ - ఈ వేళా అమ్మకం ఎట్లా వుంది?

ఏజంటు:- చాలా బాగుంది. ఆరునెలల అమ్మకం ఈ రెండు రోజులలోను అమ్మింది!

మైకేలోవు:- ఎవరు కొన్నారు?

ఏజంటు:- చాలమంది కొన్నారు. వానిలో అఫనాసివిచ్ కోటికిన్ ఒక్కడూ మూడువందలు కొన్నాడు. బేరాలు పోతాయేమోనని రాత్రి నిద్ర పోనేలేదు. నా శక్తి కొలదీ...

మైకేలోవు:- నీ శక్తి మండిరి. ఇంకా నీదగ్గిర యేమన్నా వుందా?

ఏజంటు:- ఆట్టేలేదు. అయినా మీకేమాత్రం కావాలి?

మైకేలోవు:- నీ తెలివి తగలేసినట్టేవుంది... జోలోవా! వెళ్ళి కొట్టులోవున్న వోడ్కా అంతా పారపోసిరా. ఒక్క చుక్క కూడా వుంచకు.

ఏజంటు:- ఆ- ఏమిటి! పారపోస్తారా? (జోలోవాతో) ఎక్కడికి వెళుతున్నావ్?

జొటోవా:- గింజురు చావు. [వెళుతుంది.]

రోమనోవు పరుగెత్తి వస్తాడు. అతని వెనక గుడ్డళ్ళు, గునపాలు, బక్ షాట్ తుపాకులు తీసుకొని చాలమంది రైతులు వస్తారు.

రోమనోవు:- నేను అంతా చూసివచ్చేను. వాళ్ళు ఇంకా కొత్త జనంకోసం చూస్తున్నారు. అందరూ కోటీకిన్ తేనెటీగల దొడ్లో వున్నారు. రైతులందరూ వాళ్ళు ఎలాగ చెబుతే ఆలాగ వింటున్నారు.

కొత్తవాళ్ళలో ఒకడు:- ఈపుట్టీగల్లా ముసురుతూన్నారు.

రెండో కమ్యూనిస్టు యువకుడు:- కామ్రేడ్ మైకేలోవూ! మాలో తుపాకులు లేనివాళ్ళం దడివిరిచి, కర్రలు తీసుకుం టాం, అనుజ్ఞ యిస్తే.

మైకేలోవు:- ఆ కర్రలతో ఏంచేస్తారు?

నాలుగో కమ్యూనిస్టు యువకుడు: ఊరికే ప్రారంభంలో ఉపయోగిస్తాము. తుపాకీదెబ్బ తిని ఎవడైనా పడిపోతే, వెళ్ళి వాడి తుపాకీ తెచ్చుకుంటాం.

జొటోవా: కామ్రేడ్ మైకేలోవు! వాళ్లపనుకి అడ్డం వెళ్ళరు. వాళ్ళని పోనీయి.

రోమనోవు:- అహా! ఎంత సుదినం. [సోటికిన్ తో] పీటరు మామా! ఒక్కదెబ్బ తీద్దాం!

సోటీను: సరిగ్గా నూటిగా తగలాలి!

రోమనోవ్:- నాకు నచ్చినవాడివి నువ్వు. (ముద్దు పెట్టుకుంటాడు)

మైకేలోవు:- వీరులారా! తమాయించండి! ఇదుగో. వినండి. నే పోయి సంగతులు చూసివస్తా.

జొటోవా:- నిన్ను ఒక్కడినీ పోనిస్తా మనేనా?

లోస్ట్రేవు:- మైకేలోవు! నేను వెడతా.

మైకేలోవు:- ఊరుకోండి, గోల చెయ్యక. ఇదేమీ వేళాకోళ ప్రభాగోతం కాదు. లోస్ట్రేవు! గ్రామంలోని కమ్యూనిస్టు సంఘానికి ఆధిపత్యం తీసుకో. నేను గనక మరో పది నిముషాలలో రాలేకపోతే వార్తలకోసం మరొక జట్టుని పంపి, వెంటనే శత్రువుల నెదిరించు. తప్పని సరయితే గాని ఎవరినీ కాల్చవద్దు. ఒకవేళ కాల్చడం అవసరం అయితే కులకులకే గురిపెట్టండి. తెలిసిందా? (ద్వారం కేసి వెడతాడు. లోస్ట్రేవు వెంబడిస్తాడు.)

లోస్ట్రేవు:- మాకన్న నువ్వు వెడితే ప్రమాదం ఎక్కువ సుమా!- నీకు! మైకేలోవు! వాళ్ళ చేతుల్లో పడ్డావంటే చంపేస్తారు.

మైకేలోవు:- నేనే వెళ్ళాలి. రాడ్జిస్కీ - ఓల్గాల విషయం ఆలోచించేవా?

లోస్ట్రేవు:- ఆ మాటే మరిచిపోయేను! వాళ్ళేరీ?

మైకేలోవు:- నేనడుగుతూన్నదీ అదే. వాళ్ళు క్వాసోవు యింట్లో వున్నారు. వాళ్ళు యేమవుతారో ఆలోచించేవా?

లోస్ట్రేవు:- అయితే యిప్పుడు నువ్వు వెళ్ళడం మరీ ప్రమాదం. క్వాసోవు యింటికి నువ్వు ఎల్లా వెడతావు?

మైకేలోవు:- మంచిది కాదూ? 'పరిస్థితులు తెగ ఆలోచిస్తూ కూర్చోడం కూడ నేరమే' అన్నాడుట ఒకడు. (నవ్వుతాడు.) పోయి వస్తా.

(లోక్తైవుతో కరస్పర్శ చేసి వెళ్ళిపోతాడు.)

[తెర.]

తొమ్మిదో రంగం.

ఒకటో ఉప రంగం.

కోరికో ఇంటిబయట - ఒకవిధమైన పల్లెటూరి పూరింటి పెరట్లో ఒక భాగం. దుంగలు, కర్రలు ఇతర చెత్తతోను నిండివుంది. కుడిచేతి వైపున వీధివైపు కోరడిలో కొంతభాగం కనిపిస్తూంది. వెన్నెల రాత్రి చాల మనోహరంగా వుంది. ఎడమవైపు నుంచి కొంతమంది రైతులు నెమ్మదిగా దొడ్లోకి వస్తున్నారు. వారందరికీ ముందుగా క్వాసోవు, పాషాలు నడుస్తున్నారు. క్వాసోవు యింటి దగ్గర కుట్రలో పాల్గొన్న వాళ్ళేగాక కొత్తవాళ్ళుకూడా వున్నారు ఆ జనంలో. క్వాసోవు చేతిలో తుపాకీ వుంది. మైకేలు రివాల్వరు పట్టుకున్నాడు. మిగిలినవాళ్ళ చేతుల్లో కూడా కత్తులో తుపాకులో లేకపోలేదు. ఒక్క రైతు కుర్రాడి చేతులో మాత్రం ఆయుధానికి బదులుగా హార్మోనియం వుంది. క్వాసోవు, కోటీకిన్ లు మినహాగా వి గి

లిన జనం అంతా తప్పతాగి వున్నారు. మాటలాడ వలసివస్తే, అతి నెమ్మదిగానే మాట్లాడుతూన్నారు.

క్వాసోవు:— ష్... ఊరుకోండి.

కోటికిన్:— (మైకేలుతో) వీధిలో ఎవరన్నా వున్నారేమో చూసిరా.

మైకేలు:— [వీధివంక చూసి] ఎవరూ లేరు.

ప్రోష్కిన్:— నేను... నా హక్కు అదీ!

క్వాసోవు:— ష్... కిటికీలోంచి చూస్తా నుండండి.

[చీకటిగావున్న కిటికీదగ్గిరికి వెళ్ళి తొంగిచూస్తాడు.]

గ్రిన్‌కిన్:— వాడిక్కడ వున్నాడా?

క్వాసోవు:— ఆం.

ప్రోష్కిన్:— నే వెడతా.

క్వాసోవు:— పావేల్ ఇవానోవిచ్! ద్వారం దగ్గరుండు.

కోటికిన్:— [ద్వారం తీయబోయి] తలుపులకి గడియలు వేసేరు. ఒక కత్తుంటే బాగుండును.

ప్రోష్కిన్:— నేను దీనితో తీస్తానుండు. [సన్నగా, పొడుగ్గా వున్న బద్దె చూపుతాడు.]

క్వాసోవు:— చప్పుడు చెయ్యకు.

[ప్రోష్కిన్ ఆ బద్దెను సందులోదూర్చి, గడియ నెత్తుతాడు. తలుపు తెరుచుకుంటుంది.

ప్రోష్కిన్:— ఇదీ పద్ధతి.

క్వాసోవ్:- దేవుడిని తలుచుకుంటూ నడవండి. సోఫ్రాన్ కుజ్మిచూ! ఒరేయ్! మైకేలూ! పిమోట్రూ! నువ్వా పో.

జబోవ్:- పిమోట్రూ మరీ కుర్రాడు. వాడిని పంపకు.

క్వాసోవ్:- నా కొడుకుని పంపడం లేదూ? పావేలూ! నీవాళ్ళని దాచుకోకు.

పిమోట్రూ:- నే వెడతా.

క్వాసోవ్:- వెళ్ళు. కాని, నే చెప్పింది మరచిపోకండి. ఎవరినీ కాల్చకండి. మరో దారి లేకపోతే తప్ప. స్మృతి తప్పేలాగ బుర్ర పగలెయ్యండి. మిమ్మల్ని గుర్తుపడితేమాత్రం వదిలెయ్యకండి.

గ్రిన్‌కిన్:- కర్రతో ఎందుకు కొట్టడం!

క్వాసోవ్:- ఆ తేనెమాటలకి బహుమతీ. మరచిపోకు సోఫ్రాన్!

ప్రోష్కిన్:- మరచిపోలేదు.

షిలోవ్:- నాకు భయంగా వుంది.

క్వాసోవ్:- రండి. ద్వారం తెరవగానే హార్మోనియం మీద ప్రారంభించాలి. చప్పుళ్ళు, కేకలు, తుపాకీకాల్పులు, ఏమీ వినబడకుండా చెయ్యాలి.

మైకేలు:- చక్కని పదం పాడాలి.

తలుపు దగ్గరికి వెడతాడు.

మైకేలు:- ఆ క్రీస్తు దేవుడే రక్షిస్తాడు.

వారంతా శిలువలు తమంత తామే గీసుకుంటూగు. తలుపు తెరచివుంచేసి గ్రోషిక్రన్, మైకేలు, పియోట్ర్కలు ఇంట్లోకి వెడతారు. నిశ్శబ్దం.

పిలోవు:- [గొణుగుతూ] నాకు భయంగా వుంది.

గ్రిన్కిన్:- [వెర్రి సంతోషంతో] నాకు మహాసంతోషం... చాలా సంతోషంగా వుంది.

ఒక్క క్షణందాకా నిశ్శబ్దం. తరువాత ఇంట్లో రెండో తలుపు తెరిచిన చప్పుడు వినిపిస్తుంది.

క్యాసోవు:- ఆంద్రీకా!

ఆ రైతుకుర్రాడు హార్మోనియం వాయించడం ఆరంభిస్తాడు. మొదట పాట కలియక పోయినా సాగినకొలదీ రక్తికడుతుంది. ధ్వని హెచ్చుతుంది. ఉత్సాహకరంగా కూడా వుంటుంది. ఇద్దరు రైతులు తాగుబోతుల మాదిరిగా నాట్యం ప్రారంభిస్తారు. నాడాలు వేసిన బూట్లతో 'ధమ్మ ధిమ్మ' మని లయ వేస్తూంటారు.

ఆంద్రీకా:- [పాడతాడు]

దాక్షిసారా వొద్దు * ఇప్పట్లో వద్దు
బిగపట్టి బందూను * పేల్చరో రయ్యా!

పోషకా కల్లయితే * గొంతు కార్చేస్తాది
బలము నిలబెట్టుకోని * పోరాడ రయ్యా!

అందరూ:- [అందుకుంటారు.]

పేదవాళ్ళ పాట్లు * ఖైదీల పాట్లూను
వర్ణింప దరముకా * దయ్యోయి!
కటికి సీకటి గదుల * ఖైదీల సంకెళ్ళు
గట్టిగా తెంచాలి * రయ్యోయి!
మన కంచె కాడున్న * మద్దిసెట్టూ నీడ
మన కదే మేడలో * రయ్యోయి!
కటికసీకటిలాంటి * గోరీలలో మనము
కమ్మగా తొంగుంద * మోరయ్యా!

ఆంధ్రుః:- [పాడుతాడు.]

తాగండి జనులార! * తాగండి మీరింక
సచ్చిపొయ్యేదాక * తాగండోయ్!
బందూకు పట్టుకోని * సంతోషముగ పాడి
దునమండి రిపుల నో * రయ్యోయి!
తడి భూమితల్లియే * తప్పకుండా మీదు
కడపారిణమును మింగు * నోరయ్యా!
దుమ్ము రేగేటట్లు * దృఢముగా అడుగేసి
పోరాడితీరాలి * రోరయ్యా!

అందరూ:- [పల్లవి అందుకుంటారు.]

వాళ్ళు పాడుకుంటూండగా రాయస్కీ-ఓల్గా లు కోరడిదగ్గిరికి పరుగెత్తివస్తారు. పెరట్లోకి వాళ్ళు కనపడరు. వాళ్ళు కంగారుగామాట్లాడుకుంటూన్నా పాట నడుస్తూనే వుంటుంది.

రాయస్కీ:- ఆతడు ఈ యింట్లోనే వున్నాడు. వాళ్ళు అతడిని చంపుతూండి వుంటారు.

ఓల్గా:- ఆతడు ఇక్కడ వుండడు...

రాయస్కీ:- అదిగో తలుపుతీసివుంది. ...అతడు లోపలేవున్నాడు. వాళ్ళు అతణ్ణి చంపేస్తూన్నారు.

ఓల్గా:- వద్దు ... బహుశా ... అల్లా వద్దు. ఉండడు...

ఆంద్రీకా:- (మరింత తెంపరితనంతో)

తెల్లవారేసరికి * కోళ్ళన్ని ఒకమారు
కొక్కొరోయని * కూయు నోరయ్యా
బందూకుబిగబట్టి * సంతోషముగ పాడి
దునమాలి రిపులనో * రయ్యోయి!
వల్లకాటికి చేరు * కున్నాక మనపాట
బంధింప బడలేదో * రయ్యోయి!
దుమ్ము రేగేటట్లు * దృఢముగా అడుగేసి
పోరాడితీరాలి * రోరయ్యా!

రాయస్కీ:- ఓల్గా! నన్ను పోనీ. నేను ఒంటరిగానే వాళ్ళ పని

పడతాను.

ఓల్గా:- పావేల్! వద్దు! నిన్ను చంపేస్తారు. నువ్వు ఒక్కడివీ ఏం చెయ్యగలవు?

రాయస్కీ:- తప్పదు. ...నీకు తెలియడం లేదూ! ... అతడి గొంతుక పిసికివేస్తూన్నారు.... ఎక్కడికీ పోలేకుండా కాలు కుంటికూడాను.

అందరూ:- (అందుకుంటారు.)

పేదవాళ్ళ పాట్లు * ఖైదీల పాట్లూను
వర్ణింప దరముగా * దయ్యాయి!

ఓల్గా:- (రాయస్కీని బలవంతంగా ఆపడానికి ప్రయత్నిస్తూ) నిన్ను పోనియ్యను. నీది వట్టి వెర్రి. అదిగో చూడు. అందరి దగ్గరా ఆయుధా లున్నాయి చూడు. వూరు వూరంతా తిరుగబడింది. మనం తప్పించుకు పోదాం. చులకనగానే ఊరి వెలపలకి చేరగలం. ... ఓ బండీ కుదుర్చుకుందాం. సైన్యాలతో మళ్ళీ రావచ్చు.

రాయస్కీ:- నేను వాడితోనే వస్తా.

బలవంతంగా విడిపించుకుంటాడు.

అండ్రీకా:- (పాడతాడు.)

తాగండి! జనులారా! * తాగండి మీరింక!

* * * *

పోరాడి తీరాలి * రోయ్యా!

రాయస్కీ:- పారిపోవడమా! అది వాడు చేయవలసిన పని. నేను కాదు. (ఓల్గాని తోసేసి, చేతిలో రివాల్వరు దృఢంగా పట్టుకుని, కంచె దుముకుతాడు. కొన్ని సెకనుల పాటు సంగీతం ఆగుతుంది.) వెధవల్లారా! మీ రంతా ఏం జేస్తూన్నారిక్కడ?

కోటికిను:- ఇక్కడున్న వాళ్ళంతా రైతులే! వెధవలు లేరు.

వారు రాయస్కీని చుట్టుకుంటారు. మరల సంగీతం ఆరంభించబడుతుంది.

రాయస్కీ:- మైకేలోవు ఏడీ!

క్వాసోవు:- అతడిని మేం కాపలా కాయడం లేదు. అయినా నీకాతని పనేమిటీ? (హఠాత్తుగా తుపాకి మడమతో రాయస్కీ జబ్బమీద కొడతాడు. చేతిలోని రివాల్వరు కిందపడిపోతుంది. వెనకనుంచి రైతులు కర్రలతో రాయస్కీ తలమీద కొడతారు. అతడు కింద పడతాడు. నలుగురూ కలియపడి పట్టుకుంటారు. ఓల్గా వెర్రికేక పెట్టి మూర్ఛపోతుంది.) వాడి చేతులు కట్టెయ్యండి. (రాయస్కీని గట్టిగా కట్టేస్తారు.)

కోటికిన్:- వాడి నోట్లో ఈ గుడ్డ కూరండి.

క్వాసోవు:- కోరడి దగ్గర పారేసి చావకొట్టండి.

(రాయస్కీని తీసుకుపోయి కంచెమీద పారేస్తారు.)

అందరూ:- (పాడుతూంటారు.)

పేదవాళ్ళ పాట్లు * కైదీల పాట్లూను,

వర్ణింప తరము కా * దయ్యో్యాయి!

*  *  *

ఇంటి లోపలిభాగం కనిపించేవరకూ వేదిక నెమ్మదిగాతిరుగుతుంది. సంగీతం ఇప్పుడువినిపించదు.

రెండో ఉపరంగం.

కటిక చీకటి. ఇంటివెలుపలనుంచి గానమూ, హార్మోనియం చప్పుడూ వినిపిస్తూంది. తలుపుకిర్రు, జాగ్రత్తగా వేస్తూన్న అడుగుల చప్పుడు వినిపిస్తుంది.

మైకేలు:- తలుపు వేసెయ్యండి; లేకపోతే పారిపోతాడు.

పోస్కిన్:- పారిపోలేడు. ఆ సంగతి నాకు వదిలెయ్యండి.

పిమోట్కా:- నేను ఎక్కడికి వెళ్ళను?

మైకేలు:- మాట్లాడకు.

పోస్కిన్:- నేను మంచం దరికి వెళతాను. అగ్గిపుల్ల...

పిమోట్కా:- అగ్గిపుల్ల గియ్యకండి.

మైకేలోవు కంఠం:- పాపం - మీకు దీపం కావాలేం?

(నిశ్శబ్దం.) దీపం ఇవ్వమంటూరా ఏమిటి? మాట్లాడరేం!

ప్రోస్కిన్:- అవసరం లేదు. దీపం లేకుండానే నిన్ను పట్టుగోకలను.

మైకేలోవు:- ఓహోహో! నువ్వా! పోత్రిష్కి నూ! ఇంతఆలస్య మయిందేం?

పోత్రిష్కిన్ :- ఆయితే నన్ను గుర్తుపట్టేవు?

మైకేలోవు:- ఎంత మాట! దానికేం గాని, విశేషా లేమిటి?

పోత్రిష్కిన్:- నీకు రెండు వేలపూడుల ధాన్యం తెచ్చేము తీసుకో.

మైకేలోవు:- అంతేకదా- ఇంకో జాజేమేనా తెచ్చేవేమో నను కున్నాను.

మైకేలు:- ఇంకా మొదటిదాని లెక్క పూర్తి చేయందేనా?

ప్రోష్కిన్:- (కోపంతో) అవిసరిచూసేద్దాం. ఎక్కడున్నావు? (నడుస్తాడు. ఒకబల్ల తగిలి బోర్లా పడతాడు.) నిన్ను తగలేసి రిరా!

మైకేలోవు:- కొంచెం నెమ్మదిగారా. అంత హడావిడి ఎందుకు? నాగొంతుక కోయడానికి వలసినంత వేళవుంది. అబ్బాయిలూ! ఎందుకరాత్రి నన్ను చంపడం! (నిశ్శబ్దం.] మిమ్మల్నే! —ఎం దుకు, అంటున్నా!

పోత్రిష్కిన్:— ఎందుకంటే—

మైకేలోవు:— ఊఁ.

పోత్రిష్కిన్:- నువ్వు చస్తూంటే చూడాలనివుంది.

మైకేలోవు:- ఇంకా చిన్నవాడిని కదా నన్ను వదలకూడదూ?

పోత్రిష్కిను:- ఈ బ్రతికింది చాలులే. మిష్కా! లోపలికి వెళ్ళు. మైకేలోవు! తుపాకి కాల్చేవా జాగ్రత్త! మేము చెప్పేనట్లు

వింటే నిన్ను ఏడిపించము. కాల్చేవా - చిత్రవధ చేస్తాం. నేను అన్నంతపనీ చేస్తానుసుమీ!

మైకేలోవ్:- ఆ విషయం నాకు మాత్రం తెలియదూ? ఎందుకు కాలుస్తాను? ఉండండి; దీపం వెలిగిస్తా.

అగ్గిపుల్లగీసి కొవ్వువత్తి వెలిగిస్తాడు.

గది వెలుతురుతో నిండుతుంది. గోడలవద్దని మైకేలోవు పక్క, బల్లదగ్గర అన్నిమూలలా రైతులూ, కమ్యూనిస్టుయువకులూ తమ తుపాకులు వీరికేసి గురిపెట్టి నిలుచున్నారు. అంతా నిశ్శబ్దంగావుంది. బయటనుంచి పాట స్పష్టంగా వినిపిస్తూంది.

మైకేలు:- ఆరి నీ మొహం మండా. (తుపాకీ దించుతాడు.)

మైకేలోవ్:- వాళ్ళని పట్టుకోండి.

దాడి వచ్చిన వాడిని చుట్టుముట్టి ఆయుధాలు లాగివేసుకుంటారు. స్టోటిను ప్రోష్కాను దగ్గరకు వెళ్లి కౌగిలేసి పట్టుకుంటాడు.

స్టోటిన్:- నీ కోసం చాలా రోజులనుంచి కనిపెట్టుకు కూర్చున్నానురా సోఫ్రోనా.

మనిషిని గబగబా ఫూపేస్తాడు.

వేదిక నెమ్మదిగా తిరుగుతుంది.

మూడో ఉపరంగం.

మళ్ళీ యింటిబయటనే; పాట అప్పుడే ఆఖర వుతుంది. కులకులంతా తలుపుల దగ్గర మూగుతారు.

పిలోవు — ఓరి నాయనా! ఏం చేస్తూన్నారు లోపల?

క్వాసోవు:— మరీ మందకొడిగా వున్నారేం?

జుబోవు:- ఎక్కడా చప్పుడేలేదు.

ఒక చిన్నరైతు:— (సందులోంచి చూసి) దీపం వెలిగించేరు.

గ్రెన్కిన్:- ఏమి చేస్తూన్నారు?

వారంతా చూడడానికి కిటికీ దగ్గర మూగుతారు.

ఒక రైతు:- ఓలమ్మో! ఓ ఇవానూ! కమ్యూనిస్టు యువజనసంఘం అంతా ఇక్కడేవుంది. వీళ్ళు మోసపోయేరు.

పిలోవు:- పారిపోండర్రా!

కిటికి దగ్గరనుంచి జనం పరుగెత్తుతారు.

క్వాసోవు:- ఆగండి. ఎక్కడికి? ఎవరికి భయపడి పారిపోతారు? ఆగండి.

కోటిన్:— ఇప్పుడేదో చూడాలి. వాడు మహా జిత్తులమారి! నక్క! వాడే - జిల్లా నాయకుడు!

క్వాసోవు:- మనకంటెనూ ఎత్తులగాడు కాదు. లేవండి! యీ ఇంట్లోంచి ఒక్కడూ బయటికి పోకూడదు. ఆ దుంగలు తీసి ద్వారాలకీ- కిటికీలకీ అడ్డంగా పేర్చండి.

చెప్పినట్లుగానే కులకులంతా దుంగలు పేస్తారు. ఇంట్లో వాళ్లు కిటికీలూ- ద్వారాలు విరగకొట్టడానికి ప్రయత్నిస్తూంటారు.

పాపా:— ఆహా హ్హా! ఊం. కొట్టండి. వీరు కాల్చేద్దామనుకుంటున్నారు కదూ? కానీండి. ఊం! అంటించండి.

క్యాసోవు:- నేను వారిని అంటించేస్తా. మైకేలోవ్రా! నాకంటే పెద్దవత్తులు వేయలేవు. కిరోసిను పోయండోయి!

ఒక రైతు కుర్రాడు పరుగెత్తి కిరోసిను చూనె తెచ్చి దుంగలమీద పోస్తాడు. దూరాన అలారం గంట వినిపిస్తుంది. ఏదో అద్దం బద్దలయిన ధ్వని. లోపలవున్న వాళ్ళ తోపులకు పడిపోకుండా కులకులు దుంగలు అణిచి పట్టుకున్నారు.

మోక్రీనా:— క్రైస్తవ సోదరులారా! వాళ్ళని అంటించండి. నిప్పు మంటలలో పారెయ్యండి. మాడి, బాధపడి చావనీయండి! పాపిష్టి పీనుగులు!

క్యాసోవు:— త్వరగా. త్వరగా. అలారం మోగుతూంది. వినబడడం లేదూ?

కోటికిన్:- ఇవానూ! నీ కొడుకు లోపలనే వున్నాడూ....

క్యాసోవు:- [హఠాత్తుగా జ్ఞాపకం తెచ్చుకుని] లోపలనా...

పాషా:- నాన్నా! చిచ్చు పెట్టాలని ప్రారంభించి, నవ్వే వెనక ఆడుతావేం?

ఇంటిలోని వారు తలుపులు పగలగొట్టడా నికి ప్రయత్నిస్తూంటారు. కులకులు దొంగలు అదు ముతూంటారు.

జుబోవు: - [పీధివంక చూస్తూ] ఏమిటిది? జనం అంతా అలాగం గంటు కేసి పరుగెత్తు తూన్నారు.

క్వాసోవు: - జయమాతా! ఇల్లు అంటించండి. ముంగలకి నిప్పు తగి లించండి. తగలబెట్టండి. వేగంగా.

షిలోవు:— ఒక్క నిముషం ఆగండి. ఇవానూ! బ్రతికివున్న వాళ్ళ ని తగులబెట్టడం ఏలాగ?

గ్రిన్‌కిన్:— ఏమర్రోయి! ఏమిటి చేస్తూన్న పని?

మొదటిరైతు: -ఆగండి.

రెండో రైతు:- ఏమిటి చేస్తూన్నాం, మనము?

మోక్రినా:- వాళ్ళని కాల్చెయ్యండి! కాల్చెయ్యండి! కాల్చె య్యండి.

గ్రిన్‌కిన్:- ఏమర్రోయి! ఒక్క నిముషం వుండండి. నన్ను కాస్త ఆలోచించ నీయండి.

క్వాసోవు:- (గ్రిన్‌కినుతో) కుక్కని చంపినట్లు చంపుతా. నోరు మూయి!

మూడో రైతు: - ఎందుకు ఇదంతా?

జుబోవు:- వాళ్ళంతా వొస్తూన్నారు. కోల్కా రోమనోవు తీసుకొస్తూన్నాడు.

క్వాసోవు:- వాళ్ళని తగలజెట్టండి. మంగలకు నిప్పు!

రెండో రైతు:- నీ తరం!

గ్రిన్‌కిన్:- క్వాసోవూ! నువ్వు సారా యిచ్చినందుకు నమస్కారాలు. కాని, నిన్ను ఈ యింటికి నిప్పు పెట్టనీయను.

క్వాసోవు:- నువ్వు పెట్టనీయవు!

కొందరు రైతులు క్వాసోవుమీద పడతారు. మిగిలినవాళ్ళు చుట్టూ నిలబడి కాపలా వుంటారు.

రెండో రైతు:- పట్టుకోండి! లేకుంటే ఎవరేనా చంపుతారు.

క్వాసోవు గ్రిన్‌కిను ముఖంమీద కొట్టి పడతోస్తాడు. అందరూ గలిభీ పడతారు. కిటికీ తలుపులు విరగ్గొట్టి మైకేలోవు తుపాకీ చేతపట్టుకుని కిటికీలో కూర్చుంటాడు. మద్దు కరస్త్రితో సోటిన్ మరొక కిటికీలో ప్రత్యక్షం అవుతాడు. రోమనోవు చేతరివాల్వరు పట్టుకొని, కంచె దాటి వస్తాడు. అతని వెనకాలే అతని పటాలమూ - మిగిలిన రయితులూ వచ్చేస్తారు. కొరడి విరిగిపోతుంది. కమ్యూనిస్టు యువకులు కిటికీలలోంచి వురికి పోరాటంలో కలుస్తారు. కులకుల

గుంపు చావదెబ్బలు తింటారు.

మైకేలోవ్:- వాళ్ళందరినీ కట్టేయండి!

కులకుల్ని కట్టేస్తారు. క్వాసోవ్పని తాళ్ళతో బిగించి పోటిన్ కట్టి వేస్తాడు.

పోటిన్:- [వెక్కిరిస్తూ] కష్టంగా వుంటుంది. వుంటే చెప్పు, ఇవానూ! కొంచెం వదులు చేస్తా.

క్వాసోవ్:- [పిడికిళ్ళు బిగించి] బాగానే వుంది. అలాగ వుంచు.

ఓల్గా:- (తేరుకొని) రాయస్కీ ఏడి?

మైకేలోవ్:- నే చూడలేదు.

నిశ్శబ్దం. జనులు ఆరాటం చూపుతారు.

గ్రిన్కిన్:- ఓహో! అతడా? అక్కడవున్నాడు.

రోమనోవ్, మరొక కమ్యూనిస్టు యువకుడూ రాయస్కీ కట్లు విప్పుతారు.

రోమనోవ్:- ఓరి బాబూ! ఇక్కడ ఏలాగ వచ్చావోయి!

మైకేలోవ్:-(గట్టిగా) నీ ఆజ్ఞని యెందుకు రద్దుచేసుకోలేదు?

రాయస్కీ:- దానిని గురించి తర్వాత మాట్లాడుకుందాం.

మైకేలోవ్:- తప్పకుండా. నిన్ను వెనక్కి రమ్మన్నారు. వెంటనే జిల్లా ఆఫీసుకి వెళ్ళు.

ఓల్గా:- నీ కోసమే చావుకి సిద్ధం అయ్యేడు. ఒక్కడూను. నీ కోసమే ఒక్కడూ ఇంతమందిని ఎదురుకున్నాడు. ... ఇంక

నువ్వు! ఇదేనా నువ్వనవలసిన మాట!

మైకేలోవు:- థ్యాంక్స్. సావేజ్! అయినా నువ్వు విచారణకి సిద్ధం కావలసిందే. [తుంచేసినట్లు] ఓల్గా! నీతో మాటాడడానికి తగిన అవకాశం లేనందుకు చాలా విచారిస్తూన్నా.

ఓల్గా:- [క్వాసోవుని సమీపించి] జరిగింది యిది. ... మీరూ మేమూ బుర్రలు పగలకొట్టుకుంటూంటే క్వాసోవు సోవియటు ప్రభుత్వాన్ని తగలపెట్టడానికి సిద్ధం అయ్యేడు. — [మైకేలోవుని చూపించి] ఈతణ్ణి.

షిలోవు:- నిజం! నిజం!

ఓల్గా:- ఇంక మనం! వీడికే సాయం చెయ్యడం? అసంభవం! అది సరయిన పని కాదు. ...మనలో మనమే ఒకటిరెండు విషయాలు ఆలోచించుకోవలసి యుంటుంది. నాకు నేనే ఏభై పూడ్ల ధాన్యం అపరాధపు పన్ను వేసుకుంటున్నా. ఇదిగో ఇప్పుడే బండికి ఎక్కిస్తా. మీరంతా కూడా నాలాగే చెయ్యమని కోరుతూన్నా.

షిలోవు:- నిజం. వాస్యా! ... నేను ఏభయి పూడులిస్తా.

క్రిస్కిన్:- పౌరులారా! నా వద్ద ధాన్యం వుంది. క్వాసోవు నా యింట ధాన్యం పోసి, ఎవరేనా అడుగుతే 'నాదే' నని చెప్పమన్నాడు. అది నాదే ననక నయితే అంతా ప్రభుత్వానిదే! ... ఇంక నామటుకి నేను ఓ వంద పూడ్లిస్తా.

షిలోవు:- వెంటనే బయలుదేరితే ఉదయం అయ్యేటంతకి పట్నం

చేసుకుంటాం.

రోషనోవు:- నగరానికా! ఆహాహా! నగరజీవనం ఎంత మధురం! మైకేలోవూ! ఈ ఈలకుల్ని ఏం చేద్దాం?

మైకేలోవు:- అవతలకి ఈడ్చెయ్యండి.

క్వాసోవు:- తొందరపడకండి. అప్పుడే అవలేదు. మైకేలోవూ! ఈ లోకంలో నువ్వైనా వుండాలి. మేమయినా వుండాలి. ఇద్దరికీమాత్రం చోటు చాలదు.

మైకేలోవు:- నువ్వే పోతావని నా భయం. క్వాసోవూ! లెక్క తప్పువేసేవు. మైకేలోవుని చంపాలని చూసేవు. కాని, పాపం నీ అంచనా కుదరలేదు. మైకేలోవు ఒక్కడే నని నీ వూహ: —కాని, మైకేలోవులు లెక్కలేనందరున్నారు. ఇదుగో! చూసేవూ? [చుట్టూవున్న జనాన్ని చూపుతాడు.] ఈ మూల మరికొందరున్నారు, చూడు. వీళ్ళందరినీ మంట బెట్టడం నీ తరం కాదు.

[తెర.]

# విశ్వసాహిత్యమాల

## మా యితర గ్రంథాలు.

| | | |
|---|---|---|
| లియో టాల్ స్టాయి | * | 0-3-0 |
| హిందూదేశము: క్రైస్తవ పరిభుత్వనిర్మాణతత్వం | * | 0-8-0 |
| ఇటలీ | | 0-4-0 |
| ఫాసిజం: కమ్యూనిజం: స్త్రీలు | * | 0-4-0 |
| సందేశం | * | 0-2-0 |
| కారల్ మార్క్సు ఉపదేశాలు | § * | 0-6-0 |
| సోషలిజం ఎందుకు | † | 1-0-0 |
| నా రష్యాయాత్ర | | 0-8-0 |
| సోవియటు కమ్యూనిజం | | 0-6-0 |
| రష్యా విప్లవం | § * | 0-6-0 |
| విప్లవగీతాలు | * | 0-0-6 |
| లెనిన్ ఉపదేశాలు | | 0-6-0 |
| పారిస్ కమ్యూన్ | | 0-6-0 |
| నాడు—నేడు | | 1-4-0 |
| కమ్యూనిస్టులతో- | | 0-1-6 |
| రాజ్యాంగయంత్రం | | 0-2-0 |

| | |
|---|---|
| విప్లవ సందేశం | 0-2-0 |
| చీనా కథలు | 0-4-0 |
| పల్లెటూళ్లలో | 0-6-0 |
| కూలి-పని: పెట్టుబడి | 0-6-0 |
| అర్థశాస్త్ర మూలసూత్రాలు | 0-1-0 |

* ప్రతులు లేవు.
§ నిషేధించబడింది.
† తిరిగి ముద్రించబడుతూంది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B183 |
| పుస్తకం పేరు | పల్లెటూళ్లలో |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 183 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |